Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

బాలల గోడు

పంపినవారు:
వేములకొండ వెంకటరావు, కాకినాడ




*Release Through*

**THE VAUHINI PICTURES LIMITED,**

**MADRAS :: VIJAYAVADA :: GUNTAKAL**

# చందమామ

సంచాలకుడు :: చక్రపాణి

సంపుటి 11 : సెప్టెంబర్ 1952 : సంచిక 3


మంచిపని సంకల్పించటం, ఆ సంకల్పాన్ని సాధించి తీరటం ప్రజ్ఞావంతుల లక్షణం. చాలామంది అనేకమైన పనులను సంకల్పిస్తారు కాని, వాటిని సాధించి తీరాలనే దీక్షవుండదు. 'నేను ఈ పనిచేసి తీరతాను' అనేపట్టుదలనే 'శపథం' అంటాము. నిజానికి శపథం పూనటం సులువే. దానిని నెరవేర్చడంమట్టుకి శ్రమదమాదులతో కూడుకొన్నపని. ఆ నెరవేర్చుకోవటంలో ఒక్కొకప్పుడు ప్రాణాలనే బలిపెట్టవలసివస్తుంది. మాట నిలబెట్టుకోవటంకోసం ఎన్నోకష్టాలుపడిన శ్రీరాముడు, పంచపాండవులు, హరిశ్చంద్రుడువంటి పురాణపురుషుల దివ్యగాథలన్నీ ఇందుకు తార్కాణలే. ఇటువంటి శ్రేణికి చెందినదే ఈ సంచికలోని 'అమరజీవి' కథ. 'మానవవిగ్రహాలను చెక్కను' అని శపథం పూనిన మహాశిల్పి పరంజ్యోతి అష్టకష్టాలకు లోనై, అసువులనే కోల్పోవలసి వచ్చింది. శపథం సాధించాలంటె అనేకమైన ప్రతికూలశక్తులను ఎదుర్కోవాలి.



# వేటగాని సాహసం







ఒక కారడవిని
వేటగాడు ఒకడుండేవాడు.
తప్పదతని గురి
ఎంతో నేర్పరి ఆ విలుకాడు.

బాలుడనాథుడు
ఒకడతనికి తోడుగ ఉన్నాడు.
నీడవలె ఆ
వేటగాణ్ణి వెన్నాడేవాడు.

వేటగాని గురి
చూచి ముగ్ధుడై ఆ పిల్లాడు
ఆనందంతో
కేరిచప్పటులు చరిచేవాడు.

క్రూరమృగాలను
చూచి కొంచెమైనా భయపడడు.
వేటగానిలా
ఓరిమిగలవాడా బాలకుడు.

వారిద్దరునూ
ఒకరోజున వేటకువెళ్ళారు.
ఎలుగుబంటులను
రెంటినొక్క చోటున చూచారు.

వీరిని గని ఆ
మృగాలొక్క అదటున ఉరికాయి.
అరణ్యమంతా
దద్దరిల్లిపోయే ట్టరిచాయి.

ఒకభల్లూకం
వేటగానిమీదకు ఉరికింది.
రెండవదానికి
బాలునివైపు కదను దొరికింది.

దురదృష్టమది
అతనివద్ద అమ్మొకటే ఉంది.
ఏమిచేయటం,
కడకతనికి ఒకటే తోచింది.

ఆ బాణంతో
బాలునిపైకురికే జంతువునూ
కూల్చి కాచుకొని
నిలుచున్నాడు, కదలడెంతకునూ.

మీదిమీదికా
ఎలుగుబంటి తిన్నగ వస్తున్నది.
వేటగాడు కను
ఱెప్పడు, ఎరుగడసలు భయమన్నది.

కొంచెంసేపా
ఎలుగుబంటి నిలుచుందొకలాగే.
వెళ్ళిపోయినది
వచ్చినత్రోవను తిరిగి అలాగే.

సాహసముంటే
చాలు, మనిషికెన్నడు ముప్పుండదు.
ఇతరులకోసం
సాహసించినా ఏ తప్పుండదు.




రచన: "బైరాగి"



1



2



3



4



5



6



7




8



9

ఇక్కడ తొమ్మిది బొమ్మలున్నవి. వీటిల్లో ప్రతి బొమ్మలోనూ మా చిత్రకారుడు ఒక్కొక్క విధమైన తప్పు చేసివున్నాడు. ఆ తప్పులేమిటో మీరు పట్టగలరా?

సరిఅయిన జవాబులకు వచ్చేనెల చందమామ చూడండి.




దేవీనగరంలో ఒక పేరుపొందిన దేవాలయం వుండేది. అది పురాతనకాలపు ఆలయం. దాని భాగాలన్నీ చాలావరకు శిథిలమైపోయినై.

అంతగా అది శిథిలమైపోయినప్పటికీ, దాని శిల్పసంపదమట్టుకు చెక్కుచెదర లేదని చెప్పుకొనేవారు. ఈ చిత్రమేమిటో చూదామని ఒకప్పుడు బయల్దేరి అక్కడకు వెళ్ళాను. వెళ్ళిచూస్తునుకదా—గుడిగోపురాలు, స్తంభాలు, గుమ్మటాలు, మండపాలు-ఒకటేమిటి, ఏది చూచినా అద్భుతమైన బొమ్మలతో, లతలతో జీవకళ ఉట్టిపడుతూవున్నది!

చిత్రాలన్నిటిలోకీ నన్ను ఎక్కువగా ఆకర్షించింది ఒకేఒక్క విగ్రహం—గుడి మూలని వున్న వాణీదేవి. ఎంత కళ! ఎంత కాంతి!! దాని అందం ఏమని చెప్పేది? 'స్వర్గలోకంలో నివసించే వాణీదేవిని ఈవిధంగా భూలోకమందు అవతరింపజేసిన ఆ మహాశిల్పి ఎవరోకదా!' అనుకున్నాను. ఐతే—'అపురూపంగా దివ్యమందిరంలో పెట్టి పూజించాల్సిన ఈ విగ్రహాన్ని జనసంచారంలేని ఇటువంటి చోట పడవేశారేమీ?' అని సందేహంకూడా నాకు వెంటనే కలిగింది.

ఈ జిజ్ఞాసతో విగ్రహంవేపు చూస్తూ ఎంతసేపు నిలబడిపోయానో నాకే తెలియదు. ఆలోచనలో పడ్డాను. ఉన్నట్టేవుండి మనిషి దగ్గిన చప్పుడు వినిపించింది. ఆ శబ్దం వచ్చినవేపు గిరుక్కున తిరిగాను. ఎవళ్ళూ కనబడలేదు. నలుమూలలూ కలియజూచాను. గుడివెనుక గుమ్మంలో—శుష్కించిన శరీరంతో, లోతుకు పోయిన కన్నులతో, కొసప్రాణాలతో వున్న ఒక ముసిలివాడు ఆ విగ్రహంవంక తదేక దీక్షతో చూస్తూ పిచ్చివాడిలాగా కూర్చుని

సి. పుండరీకాక్షుడు - శ్రీకాకుళం



వున్నాడు. ఇందాక దగ్గినవాడు ఇతడే ఐవుంటాడని, దగ్గిరసా వెళ్ళాను.

వెళ్ళి, ఆలయంగురించీ, ఈ విగ్రహాన్ని గురించీ చెప్పమని ఆత్రంతో అడిగాను. నే నడిగిన ప్రశ్నలన్నీ శ్రద్ధతో విన్నాడు ముసిలివాడు. పెద్దగా నిట్టూర్చి, ఒక నిమిషం మౌనం వహించాడు.

తరువాత, "నాయనా!—మా మహారాజు ధర్మప్రభువు. ప్రజను కన్నతండ్రిలాగా చూచుకొనేవాడు. అందుచేత, రాజ్యం ఎటువంటి లోపమూ లేకుండా, సమస్త సంపదలతోనూ తులతూగుతూ వుండేది. ప్రభువుకు కళలంటే ప్రాణం. చిత్రకారుల నందరినీ సమావేశపరిచేవాడు. సన్మానించేవాడు. ఒకప్పుడు ఆయనకు, శాశ్వతమైన కీర్తితెచ్చే గొప్పపని చేయాలని బుద్ధిపుట్టింది," అని చెబుతూవుంటగా ముసలివాని కన్నులు చెమ్మగిలినై.

కొంచెంసేపు ఆగి. మళ్ళీ చెప్పసాగాడు, "మహారాజు చాటింపువేయించగా, దేశదేశాలనుండి శిల్పులు ఎందరో వచ్చారు. తమ తమ ఆధిక్యతలనుగురించి ప్రభువుకు మనవిచేసుకున్నారు. పరంజ్యోతి అనే మహాశిల్పి ముందుకువచ్చి 'ప్రభూ!—ఒక ఆలయం నిర్మించటానికి అనుజ్ఞ దయచేయించండి. దానిపైన అద్భుతమైన శిల్పంకూర్చి, విశికకీర్తి ఖండాంతరాలలో మోగిపోయేటట్టు చేస్తాను,' అని విన్నవించాడు.

మహారాజు పొంగిపోయాడు. తలుచుకొన్నంతలో ఆలయనిర్మాణానికి కావలసిన సాధనసామగ్రి వచ్చిపడింది. వేలకొద్ది పనివాళ్లు అమరిపోయారు. మూడేళ్ళు ఆయేసరికల్లా అపురూపమైన ఈ ఆలయం తయారైంది..." అంటూవుండగా ముసలివాని రెండుకన్నులనుండీ జలజలమని బాష్పాలు రాలినై. మాటాడలేకపోయాడు.

అతడి వాలకం నాకేమీ అర్థంకాలేదు. ఐనా, ఉండబట్టలేక పలకరించాను. కొంత సేపటికి తేరుకుని, తెలివిలో పడ్డాడు. "నాయనా!—తయారైన ఆ గుడి చూదామని మహారాజు వచ్చాడు. చూచాడు. ఆనందభరితు డయ్యాడు. అన్నీ చూచిన తరువాత చివరకు, గుడి కొసనివున్న ఈ విగ్రహంవద్దకు వచ్చాడు.

"దీనిని చూస్తూనె ఆశ్చర్యంతో 'ఏమిటీ అద్భుతమైన శిల్పచాతుర్యం! ఈ విగ్రహాన్ని ఇక్కడ వుంచారేమిటి? తీసుకపోయి స్వామి ప్రక్కని ప్రత్యేకమందిరంలో ప్రతిష్ఠింపించండి!' అని ఆజ్ఞాపించాడు.

"అప్పుడు రాజుదగ్గరనే వున్న మంత్రి 'ప్రభూ!—స్వామిసమీపంలోని మందిరం దేవరవిగ్రహాన్ని స్థాపించటానికని ప్రత్యేకించివుంచాము. దీనికేముంది, ఈ విగ్రహం ఎక్కడ స్థాపించినా పాయె!' అంటూ ఎంతో యుక్తిగా, రాజుమనస్సుకు నచ్చేటట్టుగా చెప్పబోయాడు.

"అందుకు రాజు 'అలాకాదు మంత్రీ! ఇది మన శిల్పకారుడు శక్తిఅంతా ధారపోసి తయారుచేసిన అద్భుతవిగ్రహం! దీనిని చూడటానికి దేశదేశాలనుండి గొప్ప



గొప్పవాళ్లంతా వస్తారు. దీనిని వెంటనే దివ్యమందిరంలోనే స్థాపించండి!' అని రాజు మరిమరి చెప్పాడు.

"అంతలో మంత్రి సంజ్ఞచేయగా, రాజ్యంలోని ముఖ్యులందరూ వచ్చారు. "ప్రభూ!— ఆ దివ్యమందిరంలో ఏలిన వారి విగ్రహమే ఉండాలి!!" అంటూ ఏక కంఠంతో విన్నవించారు. అంతమంది ముఖ్యులు అలా కోరుతూ వుంటే వారిమాట కాదనలేక రాజు ఏమీ చెప్పకుండా అంతఃపురానికి వెళిపోయాడు.

రాజు వెళ్ళగానే మంత్రి శిల్పివద్దకు వచ్చి, విషపునవ్వు నవ్వుతూ, "ఏమయ్యా

శిల్పీ!—మానవవిగ్రహం చెక్కనని శపథం పట్టానంటివే! ఎందుకువచ్చిన శపథం! ఇప్పుడు చూడు. నీవు తయారుచేసిన ఈ వాణివిగ్రహాన్ని దివ్యమందిరంలో స్థాపించవద్దని ప్రజలంతా రాజుగారికి ఏకకంఠంతో మనవిచేసుకున్నారు. ప్రభువువారు కూడా దీనిని ఇక్కడే వుంచమని ఆజ్ఞయిచ్చి వెళ్ళారు. ఈ విగ్రహానికి బదులు ప్రభువువారి విగ్రహం చెక్కివుంటే ఈపాటికి ఆ దివ్యమందిరంలో అలంకరింపబడివుండేది కదా! నీ శిల్పవిద్యకు రాణింపు కలిగేది కదా! నీకు పేరూ ప్రతిష్ఠా వుండేవికద! ఇప్పుడైనా ఏమిపోయింది? నా భార్య విగ్రహం చెక్కియిచ్చి, ముందు ఆమెను సంతోషపెట్టు. నీపేరూ ప్రతిష్ఠా నిలబడేలా చూస్తా" అన్నాడు.

ఈమాట వినగానే శిల్పి 'హారి దుష్టుడా! నా శపథం భగ్నంచెయ్యటానికి ఈవిధంగా బందోబస్తు చేశావా? కసితీర్చుకున్నావా? కడుపునిండిందా? కానీ..." అంటూ నిస్పృహతో కుప్పగా కూలిపోయాడు!

"నా వాణికి పూజ్యతలేని ఈ గుడి ఉంటేమి, లేకేమి? నాకు నామరూపాలు లేకుండాచేసిన నీవు మాత్రం బాగుపడబోయేదేమిటి?" అంటూ నిట్టూర్చి కన్ను మూసి, మహాశిల్పి పరంజ్యోతి గుండెపగిలి చచ్చాడు!!" అని చెబుతూ ముసలివాడు వలవల యేడ్చాడు.

నాకూ ఉద్రేకం ఆగలేదు. "పరమ దుర్మార్గుడు...ద్రోహి! ఆ దుష్టమంత్రే నా కంటబడితేనా...?" అంటూ మొలలోవున్న బాకు చర్రుమని దూశాను.

అమట్టున ముసిలివాడు లేచివచ్చి ఆవేశంతో, "నాయనా!—ఆ దుష్టుడు, దుర్మార్గుడు, శిల్పిని బలికొన్న మహాపాపి వీడే! వీడే!!" అంటూ తడవులేకుండా నా చేతిలోని బాకు లాక్కొని గుండెలోపొడిచేసుకుని, నేలకు ఒరిగాడు!!!






## 9

[రాజ్యం శత్రురాజుచేతులలో పడబోతున్నదనే వార్త భటులవల్ల తెలియగా, దేవసింహుణ్ణి వెతికే భారం మంత్రికి వదలి, రాజ్యాన్ని సంరక్షించేందుకుగాను వైద్యుడు యింటి ముఖం పట్టటం, అనేక విపరీతపు కలలుగన్న శక్తిసింహుడు చివరకు దేవసింహుడున్న దేవాలయంలో ప్రవేశించబోవటంవరకూ చదివారుకదూ? ఆ తర్వాత—]

కుర్రవానిని ఎత్తుకొని శక్తిసింహుడు ఆలయంలో అడుగుపెట్టాడు. అయితే కుర్రవాడు శక్తిసింహుణ్ణి సరాసరి దేవసింహుడివద్దకు తీసుకుపోలేదు. అక్కడి వింతలన్నీ ఒక్కొక్కటే చూపిస్తూ "ఇక్కడికి మాలాంటి పిల్లలు తప్ప యింకెవ్వరూ రాకూడదు. మా అమ్మ వచ్చేలోగా మా బంతి మాకిచ్చేసి త్వరగా వెళ్ళిపో" అన్నాడు.

ఇది వినటంతో శక్తిసింహుడి ఆశ్చర్యం మరింత ఎక్కువైంది. ఏమైనా సరే ఈ దేవాలయ రహస్యం ఏమిటో, కలలో తనకు కనుపించినట్లు దేవసింహుడు ఆ లోపల వున్నాడో లేడో రూఢిచేసుకొనిగాని పోకూడదని నిశ్చయించుకున్నాడు. ఈ నిశ్చయంతో, "ఫరవాలేదులే. మీ అమ్మతో నేను చెబుతాలే" అంటూ కుర్రవాడిని లాలించి ఎత్తుకుని ముందుకు సాగిపోయాడు.

ఇంతలో సింహాలూ, పెద్దపులులూ అరుస్తున్న శబ్దం చెవినిపడింది. ఏమిటిచెప్మా అని ఆలోచిస్తూండేటంతలో ఆ పులులూ, సింహాలూ ఒక్కపరుగున శక్తిసింహుడి వైపు ఎగసి వస్తుండటం కనుపించింది.

శక్తిసింహుడు వెనుదిరిగి చూడకుండా పరుగుచ్చుకుని ఆలయం వెలుపలకు చేరు




కున్నాడు. చంకలో కుర్రవాడు చంకలోనే వున్నాడు. అప్పటికీ ధైర్యం చాలలేదు. అక్కడ వుంటే యింకా ఏమి ప్రమాదం సంభవిస్తుందోనని కొండదిగి పోబోయాడు. యింతలోకే ఆలయం తలుపులు మూసుకు పోయినై. అప్పటికి శక్తిసింహుడి ప్రాణాలు కాస్తంత కుదుటబడినై.

కొంచెం స్తిమితం చిక్కినతర్వాత శక్తిసింహుడు ఆ కుర్రవానిని అడిగిచూచాడు—"ఈ ఆలయం ఏమిటి? దీనిలో ఈ క్రూర మృగాలేమిటి? నువ్వూ, మీనేస్తం వాటి మధ్య ఎలా వుంటున్నారు? ఇంతకూ మీ అమ్మ ఎక్కడ వున్నది?" అని.

అందుకు ఆ కుర్రవాడు, "నాకుమాత్రం ఏంతెలుసు? మేము ఆడుకోవటంకోసం మా అమ్మ వీటిని ఈ గుడిలో పెట్టిపోయింది. వీటితో చక్కా ఆడుకుంటాం. అయితే మా అమ్మ మటుకీ అస్తమానం ఇక్కడ వుండదు. ఎక్కడికి వెడుతుందో తెలియదు. అప్పుడప్పుడు వచ్చి మమ్మలిని చూచి పోతూవుంటుంది" అని బదులు చెప్పాడు కుర్రవాడు.

వీళ్ళు ఇలా కూర్చుని మాట్లాడుకొంటూ వుండగా కొండడిగువని అలికిడి ఐంది. శక్తిసింహుడు తేరిపారచూచాడు. 'మంత్రి కాదుకదా?' అని సందేహించాడు. 'అయినా దగ్గిరికి వస్తే తెలిసిపోతుందికదా' అని రెప్పవాల్చకుండా చూస్తున్నాడు.

మరికొంచెంసేపటికల్లా ఆ వస్తున్నవ్యక్తి కొండ సగభాగం ఎక్కాడు. శక్తిసింహుడు లేచి నాలుగడుగులు ముందుకువేసి మరింత పరిశీలనగా చూచాడు. ఆ వస్తున్నది తను అనుకున్నట్టు మంత్రేనని రూఢిఐపోయింది. మంత్రికంట పడకుండా ఏమి జరిగేదీ తెలుసుకోవాలని శక్తిసింహుడు ఒక పెద్ద బండచాటున నక్కికూర్చున్నాడు. కుర్రవాడూ కూడానే వున్నాడు.



కొంతసేపటికి ఆ బండప్రక్కగా ఎవరో నడిచిపోతున్న చప్పుడైంది. ఈమారు శక్తిసింహుడు స్పష్టంగా చూచాడు. మరెవ్వరూ కాదు, మంత్రే! వడివడిగా అడుగులేస్తూ దేవాలయంవైపు పోతున్నాడు.

"ఇదే విధివైపరీత్యమంటే! యిద్దరం ఒకే చోటికి ఎలా చేరుకోగలిగామో! అయినా, ఆలయంతలుపులు మూసివున్నవి కదా, అతడు లోపల ఎలాప్రవేశిస్తాడు?" అని శక్తిసింహుడు తర్కించుకొంటూ వుండగా, ఆలయం తలుపులు తెరుచుకున్న చప్పుడు వినవచ్చింది. అప్పటికప్పుడే మంత్రి లోపల ప్రవేశించటం, తిరిగి తలుపులు ఎప్పటిలా మూసుకుపోవటం జరిగింది.

'లోపలకు ఎలాగో వెళ్లాడేకాని ఆ సింహాలూ, పులులూ బతకనిస్తయ్యా? మరోక్షణంలో బయటపడితీరాలిసిందే' అనుకుంటూ శక్తిసింహుడు ఆ కుర్రవానితో ఊసులాడుతూ అక్కడేవుండి మంత్రి రాకకు ఎదురుచూడసాగాడు.

ఇక లోపలికి వెళ్లిన మంత్రి, ఆలయం లోని చిత్రాలన్నీ చూచుకుంటూ సింహాలూ, పులులూ వున్నచోటికి చేరుకున్నాడు. వాటిని చూడటంతోనే వణుకు పుట్టింది. కాని, ఎప్పుడైతే ఆ క్రూరమృగాలు తన జోలికి రాకుండా వాటిదారిన అవి తిరుగులాడసాగాయో, అప్పుడు "యిక ఫరవా లేదులే" అని పూర్తిధైర్యం చిక్కింది.

అలా పోయిపోయి మంత్రి దేవసింహుడు ఉన్నచోటు చేరాడు. దేవసింహుడు గాఢ నిద్రలో మునిగివున్నాడు. కుర్రవాని ప్రక్కన కూర్చుని ముఖంలోకి పరీక్షగా చూచాడు. కనురెప్పలు బాగా ఉబికివున్నై. బుగ్గల పైన కన్నీటిచారికలు కనుపించినై. వెక్కివెక్కి ఏడ్చి, అలసి అలా నిద్రపోతున్నాడని గ్రహించాడు. మేల్కొల్పటం మంచిదికాదని తలచి, మరికొంత ముందుకు సాగాడు.




కొంచెందూరం పోయేసరికి దేవాలయపు చుట్టు గోడలు అడ్డుతగిలినై. దాటి పోయేందుకు దారిలేదు. తిరిగి దేవసింహుడి దగ్గరకు చేరుకున్నాడు. అప్పటికి దేవసింహుడు నిద్రనుంచి లేచి ఏదో తీవ్రమైన ఆలోచనలో మునిగివున్నాడు. మనిషి వస్తున్న అలికిడికావటంతోటే బిత్తరపోయి చూచాడు. తన అపూర్వసాధంలో అంతకు మునుపే పరిచయమై వుండటంవల్ల దేవసింహుడు మంత్రిని యిట్టే గుర్తుపట్టాడు.

"ఇక్కడికెలా వచ్చారు మీరు? మా నేస్తం ఏ మయ్యాడు?" అంటూ ఆత్రంతో ప్రశ్నించాడు దేవసింహుడు.

అందుకు మంత్రి, "ఎలా వచ్చానో యేమో నాకే తెలియదు. సరేకాని, నేస్తం అన్నావే, ఎవరు ఆ నేస్తం?" అని అడిగాడు.

"నాకు తోడుగా వుండి ఆడుకోటానికి మా అమ్మ ఒక కుర్రవాడిని యిక్కడ వుంచి వెళ్ళిందిగా. మేము బంతిఆట ఆడుకుంటూవుంటే అది బయట పడిపోయింది. దానిని వెతికితెస్తానని వెళ్ళాడు మా నేస్తం. రెండురోజులైంది. యింకా తిరిగిరానేలేదు. ఎక్కడికి పోయాడో యేమో!" అన్నాడు దేవసింహుడు విచారంగా.

"అలాగనా పాపం! పోయి వెతుకుదాం పద" అంటూ మంత్రి దేవసింహుడిని ఎత్తుకుని ఆలయం వెలుపలకు వచ్చాడు.

అప్పటికింకా శక్తిసింహుడు ఆ కుర్రవానితో ముచ్చటలాడుతూనే వున్నాడు. మంత్రి రావటం అతను గమనించనేలేదు. అయితే మంత్రిమాత్రం అతడిని చూచాడు.

చూచీచూడటంతోనే మంత్రి సందిగ్ధంలో పడ్డాడు. ఇంతదూరం వచ్చాక, యింకా తప్పుకొనితిరగటమా, ఎదటబడి అటో ఇటో తేల్చుకోవాలిగాని?—ఒక్క క్షణం ఆలోచించి, కంటపడకుండా పోపటమే మేలని నిశ్చయించుకున్నాడు మంత్రి. దేవసింహు

డితోసహా ఒక్క నిముషంలో అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

కొంచెంసేపటికి తను వచ్చినపని గుర్తు వచ్చింది శక్తిసింహుడికి.

"లోపలకు వెళ్ళిన మంత్రి ఏమైనట్టు? ఎంతకూ బయటపడడేమిటి? ఇంతకూ మృగాలనుండి తప్పించుకుని లోపల ఎలా తిరుగుతున్నాడు!" అని తనని తనే ప్రశ్నించుకున్నాడు. ప్రశ్నలకు సమాధానం దొరకక, ఏమీ పాలుపోక శక్తిసింహుడు అక్కడనే వుండి మంత్రి ఎప్పుడు వస్తాడా అని నిరీక్షిస్తునేవున్నాడు.

* * *

అక్కడ రాజధానిలో — భటులతోసహా వైద్యుడు చేరుకొనేసరికే పరిస్థితి చాలా క్లిష్టమైవుంది. శత్రుసేన వేలసంఖ్యలో వున్నదాయె. దాసోహంకావటంకన్న గత్యంతరం కనుపించలేదు వైద్యుడికి.

భటులతోసహా శత్రురాజువద్దకు బయలుదేరాడు. తీరా అక్కడకు చేరుకునేటంతలో ఒక చిత్రం జరిగింది. చూస్తూన్నంతలో బ్రహ్మండమైన సుడిగాలి రేగింది. శత్రుసేన ఎండిన ఆకులకుమల్లే అల్లల్లాడిపోయారు. మరుక్షణంలో వాళ్ళు చుట్టుముట్టిన కోట




కాస్తా అదృశ్యమైపోయింది. తక్షణమే సుడిగాలి ఆగిపోయింది.

శత్రురాజు నివ్వెరపోయాడు. "ఏమిటీ వింత? కోట ఏమైంది? ఇప్పుడు ఏంచేదాం?" అని సేనాపతిని ప్రశ్నించాడు. ఎవరు చెప్పగలరు సమాధానం?

"ఇప్పటిలో మనం చెయ్యగలిగినది ఏమీలేదు మహారాజా! తిరిగిపోవటమే ఉత్తమం" అని సలహాయిచ్చాడు సేనాపతి.

రాజుకీ అంతకంటె ఆలోచన తోచలేదు. వెంటనే సైన్యంతో తిరుగుముఖంపట్టాడు.

శత్రుసైన్యం పొలిమేర దాటేవరకు, వైద్యుడు ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకుని



మన రాజ్యాన్ని చుట్టుముట్టినట్టు తెలిసి వచ్చాను. తీరా కథ యిలా అడ్డంతిరిగింది. అయితే మీరు అధైర్యపడకండి. ఈ మాయ ఏమిటో త్వరలోనే బయటపడుతుంది. అప్పటివరకూ..." అని ఏమో చెప్పబో తుండగా మళ్ళీ సుడిగాలి రేగింది.

ఎక్కడివాళ్ళక్కడ ప్రాణాలు బిగబట్టు కుని నిలుచుండిపోయారు. అంతలోనే సుడిగాలి తగ్గింది. కోటా, భవనాలూ యెప్పటిలా ఏర్పడినై. అయితే, ఈమారు మరొకచిత్రం జరిగింది.

వైద్యుడి తలమీదుగా చిత్రమైన చప్పు డైంది. తలయెత్తిచూస్తే, యింతకాలంగా ఎదురుచూస్తూవున్న వృద్ధురాలే ఆమె!

ప్రాణం లేచివచ్చింది వైద్యుడికి. ఎలా గైనా ఈమారు వృద్ధురాలితో మాటలాడాలి. దిగిరమ్మని చేతితో సంజ్ఞచేశాడు.

వృద్ధురాలు దిగబోయింది. తీరా దగ్గరకు చేరుకోగానే ఆమె ఒకపెద్ద పక్షిగా మారి పోయి, వైద్యుడిని కాళ్ళతోపట్టుకుని క్షణంలో రివ్వున ఆకాశానికి ఎగిరిపోయింది!

భటులు నిస్తబ్ధులైపోయారు. పక్షివెళ్ళిన దిక్కుకి రెప్పవాల్చకుండా చూస్తుండగానే అది చూపుకి అందకుండా పోయింది.

తప్పుకొని తిరిగాడు. తర్వాత రాజధాని ప్రవేశించి చూడగా, కోటమాత్రమేకాదు, ఇళ్ళన్నీ మాయమైపోయివున్నై. జనం గుంపు లుగా చేరి గుసగుసలాడుకొంటున్నారు.

వైద్యుడినిచూడగానే అంతావచ్చి చుట్టు ముట్టారు. "ఎప్పుడు వచ్చారు మీరు? మహారాజావారు ఏమయారు? యిప్పుడు జరిగిన వింత చూచారుకద! ఈ మాయ ఏమిటో అర్థమైందా? నిలువ నీడలేకుండా పోయిందే! ఏమిటి గత్యంతరం?" అంటూ ప్రశ్నలు కురిపించారు.

అందుకు వైద్యుడు "మహారాజావారి సంగతి నాకూ తెలియదు. శత్రుసేన వచ్చి




వెళ్ళివెళ్ళి అది కొండపైని దేవాలయ ద్వారంవద్ద ఆగింది. ఆగటంతోనే పక్షి రూపుపోయి వృద్ధురాలుగా మారిపోయింది.

ఇంతకాలమూ శక్తిసింహుడు ఆలయం లోనే వున్నాడు. పక్షి చప్పుడు చెవినిపడ టంతో తిరిగిచూచాడు. చూస్తే పక్షి ఏదీ? వైద్యుడూ, వృద్ధురాలూ తనవైపుకే వస్తున్నారు!!

శక్తిసింహుడుకూడా లేచి వాళ్లవైపుకి సాగాడు. దగ్గరగా రావటంతోనే శక్తిసింహుడూ, వైద్యుడూ ఒకరినొకరు చూచుకుని ఆశ్చర్యపోయారు. అయితే శక్తిసింహుడితోపాటు వున్న ఆ కుర్రవాడు దేవసింహుడేమోనని భ్రమపడ్డాడు వైద్యుడు. తీరాచూస్తే కాదని తేలింది.

దేవాలయంలో వుంచిన ఈ కుర్రవాడు బయటకు ఎలావచ్చాడు? రావటమే కాక పరమ దుర్మార్గుడైన శక్తిసింహుడి చేతులో ఎలాపడ్డాడు? ఇదిచూచి వృద్ధురాలుకూడా ఆశ్చర్యపోయింది. ఇంతకూ దేవసింహుడు ఏమైనట్లు? ఈ ప్రశ్నలన్నీ వృద్ధురాలినే కలవరపరిచినై.

ఆమె కుర్రవానిని చేరదీసుకోబోయింది. అనుమానిస్తూ శక్తిసింహుడు వానిని కిందకు దించాడు. వృద్ధురాలు ఆ కుర్రవానిని చంకనెత్తుకొని చరచర ఆలయంవైపు పోయింది. వైద్యుడూ, శక్తిసింహుడూ ఆమె వెళ్ళినదిక్కుకే చూస్తూ నిలబడి పోయారు. మరుక్షణంలో ఆలయం తలుపులు తెరుచుకోవడం, వృద్ధురాలు లోపల ప్రవేశించగా తలుపులు ఎప్పటిలా మూసుకుపోవడం జరిగింది.

తర్వాత శక్తిసింహుడూ, వైద్యుడూ సావకాశంగా కూర్చుని మాట్లాడుకున్నారు. మంత్రిని తను కలుసుకున్నది మొదలూ అప్పటివరకూ జరిగిన చిత్రాలన్నీ వైద్యుడు శక్తిసింహుడితో పూసగుచ్చినట్టు చెప్పాడు

అంతా వింటూంటే శక్తిసింహుడి ఆలోచనలు పరిపరివిధాల పోయినై. "దేవసింహుడు బ్రతికేవున్నాడా? రాజ్యం శత్రురాజు చేతులలో పడికూడా తిరిగి దక్కిందా? ఇన్ని జరిగినా మంత్రీ, దేవసింహుడూ ఏమైనారో తెలియనేలేదా!"— ఈ చిత్రాలన్నీ నమ్మలేకపోయాడు శక్తిసింహుడు.

చివరకు అతడు వైద్యుడి పాదాలపైన పడి, "నన్ను క్షమించండి. ఇన్నికష్టాలకూ కారకుణ్ణి నేను. నా పాపాలకు ప్రతిఫలంగా సంసారంలో కలిగిన ఛిద్రాలు మీకు తెలియనేతెలుసు. పైగా, ఇప్పుడు నేను అనుభవిస్తున్న యమయాతన ఏమని చెప్పుకొనేది? ఎలాగైనా దేవసింహుడిజాడ తెలుసుకోండి. మంత్రి ఏమైనాడో ఆచూకీ తీయండి. మంత్రి ఏపాపమూ ఎరుగడు. నిర్దోషి.

"రాజ్యాన్ని నేను ఏనాడో ప్రజలకు వదిలివేశాను. నా చిట్టితండ్రి దేవసింహుడిని తెచ్చి పట్టాభిషేకం చేయించండి. వాడికి తలిదండ్రులు లేని కొరత మీరూ, మంత్రీ తీర్చాలి. ఇంతటి పాపభారంతో నేను మళ్లా ప్రజలకంటపడటం వట్టిమాట. ఎలాగో ఇక్కడనే కాలం వెళ్ళబుచ్చుతా. ఆశీర్వదించండి" అంటూ వలవల ఏడ్చాడు.

వైద్యుడి గుండె నీరైంది. శక్తిసింహుడికి ధైర్యంచెబుతూ, 'రాజా !—దేవసింహుడి ఆచూకీ మనకు చిక్కదు. అందుకు అమానుషశక్తులు కలిగిన ఆ వృద్ధురాలే సమర్థురాలు. కనుక వెళ్ళి ఆమెనే ఆశ్రయిద్దాం' అని ఊరడించాడు.

అయితే, గుడితలుపులు మూసివుండటం చేత, వృద్ధురాలికోసం వాళ్ళు అక్కడనే వుండి ఎదురుచూడవలసి వచ్చింది.

---

[తలవనితలంపుగా వచ్చిన ఈ మార్పు శక్తిసింహుడిలో అలాగే నిలిచివుంటుందా? ఇంతకూ దేవసింహుడూ, మంత్రీ ఏమైనట్టు? వృద్ధురాలి వల్ల శక్తిసింహుడికి ఏమైనా సహాయం లభిస్తుందా? ఇవీ, మరికొన్ని చిత్రాలూ వచ్చేనెల చదవండి.]



# స్వామిభక్తి



జపానుదేశానికి ముఖ్యపట్టణం టోకియో. టోకియోపట్టణంలో ఒక గొప్ప కాలేజీ వున్నది. జోటో అనే ఆయన ఆ కాలేజీలో ఉపన్యాసకుడుగా ఉండేవాడు.

జోటోవద్ద 'రీటా' అని ఒక పెంపుడు కుక్క ఉండేది. రీటాఅంటే ఆయనకు పంచ ప్రాణాలలోనూ ఒకటి. అంత మక్కువతో దానిని పెంచుకొంటున్నాడు. అదే విధంగా ఆయనంటే రీటాకు చెప్పలేని భక్తి, విశ్వాసమున్నూ. యజమానికీ కుక్కకూ మధ్యని అంతటి గాఢమైన అనురాగం వుండేది.

నగరంలో పనిచేసే ఉద్యోగస్థులు చాలా మంది, పల్లెలవంటి సమీపగ్రామాలలో నివసిస్తూవుంటారు. అటువంటి గ్రామాలనుండి అతివేగంగా నగరంచేరుకొటానికి బస్సులూ, ఎలక్ట్రిక్‌రైళ్ళూ మొదలైన సదుపాయాలు ఎన్నెన్నో ఉంటూవుంటాయి. ఇప్పుడు జోటోకూడా అదేమోస్తరుగా సౌఖ్యప్రదమైన ఒక చిన్నగ్రామంలో కాపరం ఉంటూ, కాలేజికి రోజూ ఎలక్ట్రిక్‌రైలును మీద పోతూవస్తూ ఉండేవాడు.

జోటోఉండే బంగళాకీ రైలుస్టేషనుకీ మధ్య సుమారు ఒక అరమైలుదూరం ఉంటుంది. ఆయన కాలేజీవేళకల్లా భోజనం చేసుకుని, దుస్తులు వేసుకుంటూ వుంటే రీటా గుమ్మండగ్గర సిద్ధంగా కాచుకుని కూచునేది. ఆయన ఇవతలకు రావటంతోనే వెంటబడి, అది రైలుస్టేషనువరకూ యజమానితో కూడా వెళ్ళేది. రైలువచ్చేదాకా కనిపెట్టుకొని ఉండి, ఆయజమాని రైలెక్కి వెళ్లడంతోనే తోక ఆడించుకుంటూ ఒక్కర్తే బంగాళాకి తిరిగివచ్చేసేది.

జోటో రోజూ సాయంకాలం నాలుగు గంటల రైలుకు కాలేజీనుంచి బయల్దేరి ఇంటికివచ్చేసేవాడు. సరిగ్గా అదేవేళకి ప్రతి

యమ్. కరీమ్ - నిజామాబాద్



రోజూ రీటా బంగళానుంచి వచ్చి స్టేషను వద్ద యజమానికోసం ఎదురుచూసేది. ఆయన కంటపడటంతోనే తోక ఆడించు కొంటూ యజమానితో ఇంటికి చేరుకునేది.

ఈ విధంగా చాలాకాలం గడిచింది.

ఒకనాడు యథాప్రకారం జోటో తన కుక్కను స్టేషనువద్ద వదిలేసి రైలెక్కి కాలేజీకి వెళ్ళేడు. దురదృష్టవశాన అక్కడ ఆయనకి అకాత్తుగా గుండెజబ్బుచేసి, ప్రాణంమీదికి వచ్చింది. ప్రిన్సిపాలు కలవరపడ్డాడు. డాక్టరును పిలిపించేటంత వరకుకూడా జోటో ప్రాణం నిలిచేటట్టు కనపడలేదు.

అంతలో జోటోయే ప్రిన్సిపాలునుపిలిచి, చివరిమాటలుగా "అయ్యా, నేను ఈ కాలేజీలో చదువుకున్నాను. ఇక్కడనే ఉద్యోగం చేయటం తటస్థించింది. అదృష్టమేమిటో గాని, ఇక్కడనే మరణిస్తున్నాను కూడా. ముంచుకు వస్తున్నది. ఇక తడవులేదు. నన్ను బ్రతికించటానికని అనవసరంగా శ్రమపడకండి. నాశవాన్ని ఈ ఆవరణలోనే పాతిపెట్టించితిరంటే నా ఆత్మ సంతోషిస్తుంది. ఇదే నా తుదికోరిక" అంటూ శాశ్వతంగా కన్నులు మూశాడు. అతని కోరిక ప్రకారం ప్రిన్సిపాలు జోటోశవాన్ని ఆ ఆవరణలోనే సమాధిచేయించాడు.

*   *   *

ఆ సాయంకాలం రీటా యథాప్రకారం స్టేషనుకువచ్చి యజమానికోసం నాలుగు గంటలరైలులో ఎదురుచూసింది. రైలు తర్వాత రైలువచ్చి, ఈలవేసి, గుప్‌గుప్‌మంటూ పోతున్నదేగాని, ఒక్కరైలులోనూ జోటో కనబడనేలేదు. రీటా చాలాసేపు కనిపెట్టుకుని ఉండి, బంగళాకు తిరిగి వెళ్లిపోయింది. మర్నాడుకూడా స్టేషనుకు వెళ్లి, కనిపెట్టుకుని ఉండి తిరిగి బంగళాకు వెళ్ళిపోయింది.



అలా రోజూ అది వస్తూ వెడుతూ ఉండేది. మొదట కొంతకాలంవరకూ దాన్ని ఎవరూ గమనించలేదు కాని కొన్నాళ్లయాక స్టేషను మేష్టరూ, టిక్కట్టుకలెక్టర్లూ పోర్టర్లూకూడా, "ఈ కుక్క ఎవరిదిచెప్మా? రోజూ సాయంత్రం అయేసరికి వచ్చి ఇక్కడ తచ్చాడి వెళ్లిపోతోంటుంది ఎందుకోసమో?" అని అనుకున్నారు.

ఒకళ్లతో ఒకళ్లు సంప్రదించుకోడంలో అది ఫలానా జోటోగారి కుక్క అనీ, ఆయన అకస్మాత్తుగా చనిపోయాడనీ, ఆయనింక రైల్లో రావటం అంటూ ఉండదనీ, దానికా సంగతి తెలియక అలవాటుప్రకారం ఆయనకోసం రోజూ అలా వచ్చి వెడుతోందనీ కనిపెట్టారు.

"నీ యజమాని చనిపోయాడే, వెర్రిదానా?" అని రీటాకు వారు తెలియచెయ్యబోయారుగాని, దానికి ఏమీ అర్థంకాలేదు. రోజూ సాయంత్రం అది మానకుండా స్టేషనుకు అలా వచ్చి వెడుతోనే ఉండేది.

కాలం గడిచిపోతోంది. నెలలూ, సంవత్సరాలూ దొర్లిపోతున్నాయి. స్టేషన్లో రైల్వే ఉద్యోగులు పాతవాళ్ళు బదిలీ ఐపోయి, వాళ్లస్థానే కొత్తవాళ్ళు వస్తున్నారు. కొత్తవాళ్లందరికి అలా వచ్చిపోతూన్న రీటా చరిత్ర తెలిసి, వాళ్లు ఆశ్చర్యపోయేవారు. ప్రభువుమీద దానికి ఉండే భక్తికీ, విశ్వాసానికీ విస్తుపోయేవారు. వాళ్లందరికీ రీటా మూలాన జోటో అంటే ఎవరో అతని చరిత్ర కూడా తెలియవస్తూండేది.

రీటా రోజూ స్టేషనుకు వచ్చివెడుతూనే ఉంది. రానురాను దానికి బెంగపట్టుకుంది. అది తిండి మానుకుంది. తిండి మానటంతోనే కృశించనారంభించింది. క్రమంగా జవసత్తువలుడిగినై. నీరసించింది. ఐనా, అది సాయంత్రంవేళ రోజూ స్టేషనుకు రావటం మానలేదు.

ఎనిమిదిసంవత్సరాలు గడిచినై. ఒక నాటి సాయంత్రం స్టేషనుకు వచ్చిన రీటా ఇక తిరిగి ఇంటికి పోలేకపోయింది. నాటి రాత్రి టోకియోనగరాన్నుంచి వచ్చే చిట్ట చివరిరైలు వచ్చేవరకూ రీటా రైళ్లవేపు నిదానంగా చూస్తోవుంది. ఆఖరిరైలు వెళ్లి పోవటంతో రీటా నిస్పృహతో ప్రాణాలు వదిలేసి ప్లాట్ఫారంమీద వాలిపోయింది.

రీటా మరణించిందనగానే చిన్నాపెద్దా అందరూ ఒక్కపెట్టున దుఃఖించారు. ఒక యజమానిని ఎంతో విశ్వాసంగా సేవించి, చివరకు అతనికోసమే ప్రాణాలు వదలిన ఆ జీవి—మనిషయితేనేమి, కుక్కయితే నేమి—ధన్యజీవి అంటూ అందరూ దానిని అనేకవిధాల మెచ్చుకొన్నారు.

ఇప్పుడు రీటా అందరకూ అల్లారుముద్దు బిడ్డలాగా వున్నది. రీటాకుగల విశ్వాసం, స్వామిభక్తిపరాయణత అందరి హృదయాలనూ కలచివైచినై. ప్రతి ఒక్కరూ 'రీటామోస్తరుగా యజమానిపట్ల విశ్వాసంగా వున్నదే జన్మ. రీటా జన్మ సార్థకమైంది!' అంటూ మెచ్చుకోసాగారు,

ఇటువంటి ఉత్తమజంతువైన రీటాను గౌరవించటానికని ఒక విలువకలిగిన రమ్యమైన పూలరథం అమర్చి, ఆ రథం మీద దానిని అతివైభవంగా ఊరేగించారు. దూరప్రాంతాలనుండి అశేషజనం వచ్చి ఆ వూరేగింపులో పాల్గొన్నారు.

ఊరేగింపు అంతా ఐనతరువాత, రీటా ప్రతిరోజూ వచ్చిపోయే స్టేషనుకుఎదురుగానే అద్భుతంగా నిర్మింపబడిన ఒక గోరీలో ఆ శవకాన్ని సమాధిచేశారు!

ఆ గోరీకి అంటిపెట్టివున్న ఒక పాలరాతిపైన రీటా ఆదర్శచరిత్ర అంతా స్వర్ణాక్షరాలతో చెక్కబడిఉన్నది. చిత్రమైన ఈ కుక్కకీర్తిని చాటే చరిత్రను ఆ స్టేషనుకు ఎదురుగా వుండే గోరీపైన ఈనాడు సైతం చదివి తెలుసుకోవచ్చు.






పుళిందరాజ్యానికి పాలకుడు సుగుణసింహుడు. ఆయన నిండు నలభైసంవత్సరాలు రాజ్యంఏలాడు. ఆ నలభైసంవత్సరాలూ ప్రజ ధనధాన్యాలతో, పాడిపంటలతో సమస్తమైన సిరిసంపదలతో తులతూగుతూండేవారు.

సుగుణసింహుడికి వృద్ధాప్యం వచ్చెసింది. ఇక రాజ్యభారం కొడుకుపైనపెట్టేసి, తను దైవచింతనలో గడపాలనే ఆలోచన కలిగింది. ఈ ఆలోచనతో ఆయన ఒక పున్నమినాటిరాత్రి తన అంతఃపురంలో అటు యిటు పచారు చేస్తూవుండగా కొటగంటలు ఖంగుఖంగుమని పన్నెండుసారులు మోగడం వినబడింది.

గిరుక్కున తిరిగి ఒక్కసారి హంస తూలికాతల్పంవైపు చూచేసరికి సుగుణసింహుని కన్నులు జిగేలుమన్నయి! ఏమీ? పదారువన్నె బంగారు చాయగల దేహకాంతితో మెరిసిపోతూ ఒకసుందరి ఆ తల్పంపైన కూర్చునివుంది!! రాజు ఆశ్చర్యపోయాడు.

"రాజా!–నన్నెరుగవా?"అని అడిగింది సుందరి. అలానే నించుండిపోయాడు రాజు.

"నాపేరు యశోదేవత. నీవు ధర్మమార్గం తప్పకుండా రాజ్యంనడిపించి, నీకీర్తి దశదిశల వ్యాపింపజేసేది ఎవరనుకున్నావు? నేనే,"అన్నది. చాలా సంతోషించాడురాజు. 'దేవీ!--నాకీర్తి నిలబెట్టినందుకు నీకు కృతజ్ఞుణ్ణి. ఐతే,—నా తరువాత నా కుమారుడి పాలనలో ధర్మం ఎలా నడుస్తుందో అనేదే నాకు పట్టుకున్న ఆలోచన' అన్నాడు.

అందుకు యశోదేవత "రాజా!-ఎందుకు దిగులు? నిన్ను నడిపినట్టే నీకొడుకునూ నడుపుతాను. చింతించకు" అంటూ, అంతర్ధానమై పోయింది. మరి కొద్దిరోజులకే సుగుణసింహుడు మరణించాడు.

టి. కల్పవల్లి - కర్నూలు



సుగుణసింహుని కొడుకు శీలసింహుడు గద్దెయెక్కి, అన్నివిధాలా తండ్రికి తగిన పుత్రుడు అని పేరుపొందాడు. తండ్రినాటి నించీ వుంటున్న వృద్ధమంత్రి ధర్మపాలుడినే తనుకూడా ఆస్థానంలో సలహాదారుగా నియమించుకున్నాడు.

ఇలావుండగా—ఒక పున్నమనాటి రాత్రి, సుగుణసింహునికి కనిపించినట్టే శీలసింహునికికూడా యశోదేవత తూలికాతల్పంమీద ప్రత్యక్షమైంది. శీలసింహుడు ఆమెపట్ల భక్తివినయాలు అగపరిచాడు. దేవి శీలసింహుణ్ణి దీవిస్తూ, "నాయనా!—ఈ వుంగరమే నీకు అంగరక్ష. ఎప్పుడైతే నీ బుద్ధి ధర్మంతప్పి వక్రమార్గానికి పోతుందో, అప్పుడు ఈ వుంగరం నీ వేలు నొక్కుతుంది. ఈ హెచ్చరిక గుర్తించి, పొరపాటును సరిదిద్దుకొంటూవుండు" అంటూ హితబోధచేసి, ఒక ఉంగరమిచ్చి అంతర్హితురాలైంది.

దేవిదయకు విస్తుపోతూ, శీలసింహుడు తనకు అంగరక్షగా ప్రసాదింపబడిన ఉంగరాన్ని ఉత్సాహంతో ధరించాడు.

ఉంగరం మహిమవల్లనూ, మంత్రి ధర్మపాలుడి సలహాలవల్లను శీలసింహుడి పరిపాలన చాలాకాలం ఎంతో నేర్పుగా, ధర్మయుతంగా సాగింది. ఐతే—ఎంతటి కట్టుదిట్టంలో వున్నప్పటికీ, యువకుడైన శీలసింహునిలో రాజ్యకాంక్ష అప్పటప్పట ఉబుకుతూనే వుండేది.

రాజ్యకాంక్షతోపాటు శీలసింహుడి మనస్సు మారిపోయింది. ఇది ధర్మం—ఇది అధర్మం అనే విచక్షణజ్ఞానం నశించింది. దురాశపుట్టింది. శనిపట్టింది. దుష్టసంకల్పాలను దోహదంచేయటానికి తగిన పరివారమంతా చుట్టూచేరారు.

అ పరివారానికి పెద్ద 'దుందుభి' అనే సేనానాయకుడు. వాడికీ రాజుకూ స్నేహం



ఎక్కువైంది. 'రాజైనవాడికి రాజ్య విస్తరణ చేసుకోవటమే ప్రజ్ఞ. ఇందుకోసం ప్రాణాలైనా బలిచేసి, రాజు ధర్మం నిలబెట్టుకోవాలి' అని దుందుభి దుర్బోధలు చేసి, శీలసింహుణ్ణి పురెక్కిస్తూ వచ్చాడు. దుందుభి నూరిపోసే ఈ బోధలముందు మంత్రి ధర్మపాలుడి మాటలు శీలసింహుడికి చెవికెక్కటమే మానివేసినై.

అందుచేత క్రమంగా మంత్రిమాటలను త్రోసిరాజనటం ప్రారంభించాడు. రాజు అధర్మంగా, అకారణంగా ఇరుగుపొరుగు సామంతరాజులమీదికి ఆకస్మికంగా దాడి వెడలటం పనిగా పెట్టుకొన్నాడు. మొండి పట్టు, క్రౌర్యం అతనిలో బాగా విజృంభించినై. ఒళ్లుతెలిసే స్థితిలో లేడని చెప్పినా అతిశయోక్తి కాదు. అటువంటప్పుడు అంగరక్ష ఐనటువంటి తన వేలి ఉంగరం ఎంత నొక్కినా అతడు గమనించకపోవటంలో ఆశ్చర్యమేముంది!

ఈ విధంగా—శీలసింహుడు మునుపటి శీలసింహుడుకాదు అని పేరు మోగిపోయింది. ఇప్పటి శీలసింహుడు పరమ దుర్మార్గుడు, క్రూరుడు, అనేకమైన చిన్న రాజ్యాలను అన్యాయంగా పడవేసుకొన్నాడు. ఇలా యుద్ధాలు సాగించే తన వేడుకకోసం కొత్తకొత్త పన్నులు ఎన్నో విధించాడు. రాజులో కలిగిన ఈ మార్పువల్ల ప్రజలు యమయాతనలు అనుభవించవలసి వచ్చింది. ప్రభువుపైన ప్రజకు ఉండే భక్తి విశ్వాసాలు సడలిపోయినై. అతడి దుష్టచర్యలకు సహించలేక తన స్వంతసేనలే అసహ్యించుకుని ఎదురుతిరుగసాగినై.

ఇంతచేసి, చివరకు శీలసింహుడికి తనపైన తనకే రోతపుట్టేటంత కష్టపరిస్థితులు ఏర్పడినై. 'లోకానికి ఎదురీది నేనెందుకు ఈ రాజ్యాలన్నీ జయించాలె? ఎందుకు పాపం, అంతమంది రాజ్యాలను అన్యాయం

చేసి కలుపుకోవాలె? ఏమి బావుకునేందుకు ఇన్నిన్ని పన్నులు విధించి ప్రజనువేధిం చాలె' అంటూ ఈవిధంగా తనుకుతనే ఎన్నో ప్రశ్నలు వేసుకోసాగాడు. ఒక్క ప్రశ్నకూ మనస్సు సమాధానం చెప్పలేక పోయింది. తన క్షేమంకోరిన వృద్ధమంత్రి ధర్మపాలుడి సలహాలు పెడచెవిని పెట్టి నందుకూ దేవి ప్రసాదించిన ఉంగరాన్ని ధిక్కరించినందుకూ శీలసింహుడు ఎంతగానో నొచ్చుకున్నాడు.

ఇలాఉండగా వృద్ధమంత్రి ధర్మపాలుడు మరణించాడు. శీలసింహుడికి తెలియకుండానే, తనకు దుర్బోధలు చేసిన మిత్రులు రాజ్యాన్ని హస్తగతం చేసుకోసాగారు. రాజ్యంలో హత్యలకు చోరీలకూ హద్దులేకుండా పోయింది. రాజభవనంలోనే ఒకరోజున కలవరం బయల్దేరింది. ఈ కలవరానికి నగరమంతా అట్టుడికినట్టు ఉడికి పోతున్నది. 'ఇదంతా యేమిటి?' అని ప్రశ్న వేశాడు శీలసింహుడు. 'ఇంకేముంది, మీ మేనకోడలు పావనిని ఉరితీయబోతున్నారు!!' అని చెప్పారు.

కలగాని మేలుకొన్నట్టయింది శీలసింహుడికి. ఆక్షణంనుంచీ అతనిని ఉంగరం విడవకుండా నొక్కుతూనేవుంది. వెంటనే మేనకోడలిని రప్పించాడు. ఆమె దైన్యావస్థకు వలవల యేడ్చాడు. మిత్రులు చేసిన కుట్ర, ద్రోహం ఆమెవల్ల గ్రహించి తక్షణమే వాళ్లందరినీ ఖైదుచేయించాడు.

ఈసారి అతని వేలు విడవక గట్టిగా నొక్కుతూవుండిన ఆ ఉంగరం గప్పున ఒక్కమారుగా వింతకాంతితో వెలిగింది. ఆ క్షణమందే శీలసింహునికి జ్ఞానోదయమైంది. అప్పుడు తనను కాపాడే అంగరక్షను పూర్తిగా నమ్ముకున్నాడు. దేవి ప్రభావం తెలుసుకొన్నాడు. తండ్రికోరికను జ్ఞాపకం తెచ్చుకొన్నాడు. నాటినుండీ మరెన్నడూ శీలసింహుడు ధర్మమార్గం వీడలేదు.






లక్ష్మీదేవి కుమారుడు మన్మథుడు. మన్మథుడు మగవాళ్ళలోకల్లా అందమైనవాడు. కొడుక్కితగ్గ కోడలు కావాలనిచెప్పి, లక్ష్మీదేవి ఆడపిల్లలలోకల్లా అందమైన రతీదేవి అనే అమ్మాయినితెచ్చి పెళ్లిచేసింది. మన్మథుడూ రతీదేవీ ఎంతో ప్రేమగా ఉండేవారు.

ఒకమాటు దంపతులలో పేచీవచ్చింది. పేచీలో తప్పు మన్మథునిదే. కనుక, ఎన్ని విధాల బ్రతిమాలినా రతీదేవి కోపం చల్లారలేదు. లాభంలేదనుకుని మన్మథుడు ఒక అడవికి పోయి దిగులుగా కూర్చున్నాడు.

అక్కడ అతని స్నేహితుడు 'అనిలుడు' తారసపడి, దిగులుకు కారణం అడిగాడు. మన్మథుడు చెప్పాడు.

అందుకు అనిలుడు "ఈ అడవిలోనే 'మరులమాతంగి' అనే తీగ ఒకటున్నది. అది సప్తవర్ణాలతో మిలమిలలాడుతుంది. దానినిండా పుష్పాలుంటాయి. ఆ పువ్వులలో ఉండే మకరందాన్ని తెచ్చి నీకు ఇస్తాను. రతీదేవి నిద్రపోయేసమయంలో ఆమె రెండురెప్పలమీదా రెండుబిందువులు తీసి పట్టించు" అని సలహాచెప్పాడు.

"ఆవిడ మేలుకొని కళ్లుతెరిచేవేళకల్లా నీవు ఎదురుగాకాచుకుని ఉండాలి. మాతంగి పూదేనె మహిమవల్ల నిన్ను చూచీచూడ్డంతో రతీదేవి నీవద్దకు పరుగెత్తుకొచ్చి, ప్రేమగా మాట్లాడుతుంది" అని ధైర్యం కూడా చెప్పాడు అనిలుడు. మన్మథుడు అమిత ఆశ్చర్యపోయాడు.

మాతంగిరసం తెమ్మని మన్మథుడు అనిలుణ్ణి పంపేడు. అనిలునికోసం అతడు ఎదురుచూస్తూ కూచునేటప్పటికి, "తపనా, తపనా! నన్నువదలి వెళ్ళిపోకేం" అంటూ స్త్రీకంఠస్వరం వినిపించింది. మన్మథుడు తిరస్కరిణీ విద్య నేర్చినవాడు. ఆ తపనుడు ఎవరో, ఆర్తనాదం యేమిటో తెలుసు

పాలంకి వెంకటరామచంద్రమూర్తి - మదరాసు




కోవాలన్న కుతూహలంతో అతడు అదృశ్యుడై అక్కడే నిలబడ్డాడు.

ఆ కేకవేసిన అమ్మాయి ఛాయ ఒక గంధర్వుని కుమార్తె, ఆమె తపనుణ్ణి ప్రేమించింది. కాని తపనుడుమాత్రం ఛాయను వదిలించుకుందామని చూస్తున్నాడు.

ఆ తపనుడు మొదట ఛాయాదేవిని వలచి, తరువాత మనస్సు మార్చేసుకుని 'వనరమ' అనే గంధర్వకన్యను పెళ్ళాడా లనే వుద్దేశంతో ఛాయను నిరాకరించాడు.

ఛాయ గోలపెట్టింది. తపనుడు, కనపడకుండా పారిపోయాడు. ఛాయ ఏడుస్తో వెనకాలే పరుగెత్తింది.

మన్మథుడు అక్కడే ఉండి ఇదంతా కనిపెడుతూ నేవున్నాడు. తపనుడు ఛాయా దేవికి చేస్తున్న అన్యాయం గ్రహించి, దీనిని సరిచెయ్యా లనుకున్నాడు.

ఇంతట్లో అనిలుడు మరులమాతంగి మకరందం పట్టుకువచ్చాడు. మన్మథుడు సంగతంతా చెప్పి, తపనుడి రెప్పలమీద ఈ తేనెచుక్కలు వేసి రమ్మన్నాడు.

అనిలుడు వాళ్ళకోసం బయల్దేరేడు.

దగ్గరలోనె ఒక గంధర్వకుమారుడూ, గంధర్వకుమారీ నిద్రపోతున్నారు. అనిలుడు ఆతని రెండు రెప్పలమీదా రెండు తెనెబిందువులు వేసేసి, మన్మథుడిదగ్గిరకి తిరిగి చక్కావచ్చాడు.

ఇంతకూ ఆ నిద్రపోతూన్నవాడు తపనుడు కానేకాదు! ఆ అమ్మాయి ఛాయా దేవీ కాదు !!—అతడు వసంతుడనే మరొక గంధర్వుడు. ఆ అమ్మాయే 'వనరమ'. ఈ 'వనరమ' ఛాయాదేవికి స్నేహితురాలు. ఈమెను చూచినతరవాతనే తపనుడికి ఛాయాదేవిపైన మక్కువ తప్పింది. వనరమ మాత్రం తపనుణ్ణిపెళ్లిచేసుకోవాలనిఎన్నడూ అనుకోలేదు. ఆమె వసంతుడనేవాణ్ణి ప్రేమించింది. వసంతుడూ ఆమెను ప్రేమిం






చాడు. వారు పెళ్ళిచేసుకుందామనుకునే ఈ అడవికొచ్చారు. అంతలోనే ఇద్దరికీ నిద్ర రట్టేసింది. మన్మథుడు చెప్పిన తపనుడూ ఛాయాదేవీ వీళ్ళే ఐవుంటారనుకొని అని లుడు వసంతుని కంటిరెప్పలమీద తేనె చుక్కలను వేసిపోయాడు.

వసంతుడు కళ్ళు తెరిచేసరికి వసరమకి బదులు ఛాయాదేవి కనపడింది. తనని తప్పించుకుపోయిన తపనుణ్ణి వెతుక్కుంటూ, వసంతుడు కళ్లుతెరిచేసరికల్లా ఆదారినే వచ్చింది ఛాయ. ఇంకేముంది ? మాతంగి ప్రభావంవల్ల వసంతుడు పెండ్లిచేసుకుందా మనుకున్న వసరమ మాటే మరిచిపోయి, ఎదుట వున్న ఛాయను ప్రేమించాడు.

ఛాయాదేవికి ఆశ్చర్యం, దుఃఖం ఒక్క మాటుగా వచ్చాయి. 'తన స్నేహితురాలైన వసరమని పెళ్లి చేసుకుంటానన్న ఈ వసం తుడు తనను పలకరిస్తున్నాడేమిటి ? దుర్మార్గుడు ! ద్రోహం తలపెడతాడా ?' అనుకొని, వసంతుడికి దొరకకుండా, ఛాయ గబగబ పారిపోయింది. ఆమెను వెతు క్కుంటూ వసంతుడు బయల్దేరేడు.

వసంతుడు వెళ్ళిపోయిన చాలా సేపటికి వసరమకు మెలకువ వచ్చింది. లేచిచూస్తే వసంతుడు లేడాయె ! గుండె గుభేలుమంది. అడవిఅంతా కలియదిరిగింది. వసంతుడు కనపడనేలేదు. బదులుగా ఛాయను తప్పించుకువచ్చిన తపనుడు కనపడ్డాడు.

ఆతడు వసరమను చూడ్డంతోనే సంతో షంతో, "వసరమా! నీకోసమే, ఆ ఛాయను వదిలిపించుకువచ్చాను" అన్నాడు. ఈ మాటకు వసరమ వళ్లు మండిపోయింది. "ఛీ, దుర్మార్గుడా !—నా స్నేహితురాలైన ఛాయకు మోసం చెయ్యటమే కాకుండా నాకూ ద్రోహం తలపెట్టదలిచావా ? ఏడీ నా వసంతుడు ? నువ్వే మాయంచేశావు. చెప్పు ఏంచేశావో" అని గద్దించింది.






తపనుడు విస్తుపోయి, "వసరమా, ఒట్టుసరి, వసంతుడిసంగతి నాకు తెలియనే తెలీ"దంటూ, అక్కడ నిలబడక వెళ్ళిపోయాడు. వసంతుణ్ణి వెతుక్కుంటూ వసరమా వెళ్ళింది.

ఆ దారినే ఆకాశమార్గాన పోతూన్న మన్మథుడు ఈ సంభాషణంతా విన్నాడు. అనిలుడు చేసిన పొరబాటు తెలుసుకున్నాడు. అతణ్ణి రప్పించి, తపనుణ్ణి చూపిస్తూ, "ఇతని రెప్పలమీదేనా నువ్వు తేనెచుక్కలు వేస్త?" అని అడిగేడు.

అనిలుడు తపనుణ్ణి పరకాయించిచూచి, "ఇతడు కాడు. ఈ అమ్మాయిమాత్రం ఆ అమ్మాయే" అన్నాడు. "అరరె. సరే అయిందేదో అయింది. ఆ తపనుడివెనకాలే వెళ్ళి, వాడు నిద్రపోగా చూసి, తేనెచుక్కలు రెప్పలమీద వేసిరా. ఆ ఛాయ ఎక్కడుందో వెతికి, ఇతడు లేచేవేళకి, ఆమెను ఇతని కళ్ళముందునిలబెట్టు" అన్నాడుమన్మథుడు.

చేసినతప్పు సర్దుకోటానికి అనిలుడు తపనుణ్ణి అనుసరించి ఆకాశమార్గాన వెళ్ళేడు. కొంతదూరం వెళ్ళేక తపనుడు అలసిపోయి, ఒకచోట పరుండి నిద్రపోయాడు. అనిలుడు అతని కంటిరెప్పల మీద మాతంగిబొట్లు వేసి, ఛాయను కనిపెట్టి తీసుకువద్దామని వెళ్ళేడు.

మరికాస్సేపటికి ఛాయాదేవి పరుగెత్తుకుంటూ అక్కడికే వచ్చింది. ఆమెవెనకాలే వసంతుడూ వచ్చాడు. అప్పుడు ఛాయ, "అయ్యో. నన్ని దుర్మార్గుని బారినుండి తప్పించేవారు ఎవరూ లేరా?" అంటూ గొంతెత్తి అరిచింది.

ఆ గోల విని మన్మథుడూ, అనిలుడూ వచ్చి, ఎవరికీ కనబడకుండా అక్కడే నిలబడ్డారు. ఆ కేకలకు నిద్రపోతూన్న తపనుడికికూడా మెలకువ వచ్చింది. వచ్చేసరికి ఎదురుగా ఛాయాదేవి కనపడింది.

మరులమాతంగి ప్రభావంవల్ల తపనుడికి ఛాయాదేవిమీద ఒక్కమాటుగా ప్రేమ ఉబికి, అప్యాయంతో ఆమెను పలకరించాడు.

ఛాయ విస్తుపోయింది. "తన్ను తప్పించుకుపారిపోయిన తపనుడి మాటలేనా! ఏదో కలగా ఉన్నదే" అనుకుంది. ఇంతలో వసంతుడు, "ఛాయా, నిన్ను ప్రేమిస్తే నేనుకాని వీడుకాదు. వీణ్ణి పొమ్మను" అన్నాడు. ఈ మాట వినేటప్పటికి ఛాయకు ఇదొక దొంగ నాటకమనిపించింది.




ఇంతలో అక్కడికి వనరమ కూడా వచ్చింది. ఛాయాదేవికోసం వసంతుడూ, తపనుడూ వాదులాడుకోడం చూసి, వనరమ "ఈ ఛాయ దుర్మారురాలు. ఈ గంధర్వ కుమారులిద్దర్నీ తనే పెళ్లాడుదామనుకుంటున్నదికాబోలు" అని, స్నేహితురాలైన ఛాయను తిట్టింది. "నేనేపాపం ఎరగ" నంటూ, ఏడ్చింది ఛాయ. తపనుడూ వసంతుడూ మరులమాతంగి ప్రభావంవల్ల ఛాయాదేవికోసం యుద్ధంచెయ్యటానికి సిద్ధపడి, కర్రలకోసం పరుగెత్తేరు.

అప్పుడు వాళ్ళిద్దరూ నిష్కారణంగా బుర్రలు బద్దలకొట్టేసుకుంటారనిచెప్పి, వాళ్లిద్దరిమధ్యా మన్మథుడు ఒక లోతైన నది అడ్డుగా ప్రవహించేటట్లు, తనమాయ వల్ల ఏర్పాటుచేశాడు. అవతల ఒడ్డునుంచి వసంతుడూ ఇవతల ఒడ్డునుంచి తపనుడూ ఒకళ్లమీద ఒకళ్లు కర్రలు విసురుకున్నారు గాని, అవి నదిలోనే పడిపోయాయి. ఇద్దరూ చెరొక గట్టుమీదా సొమ్మసిల్లిపోయారు. ఇక్కడ ఏడ్చేడ్చి ఛాయాదేవీ, శాపనార్థాలు పెట్టిన వనరమా నేలకొరిగారు.

అప్పుడు మన్మథుడు 'అనిలా!—ఈ ఛాయాదేవి లేవకముందే తీసుకువెళ్ళి తపనుడివద్ద విడిచిరా" అన్నాడు. అనిలుడలానే చేసివచ్చాడు. "ఈ వనరమను కూడా తీసుకెళ్లి నది అవతలఉన్న వసంతుని

వద్ద విడిచిరా" అన్నాడు మన్మథుడు. మన్మథుడు చెప్పినట్లు చేసి వచ్చాడు అనిలుడు.

అతనితో మన్మథుడు "అనిలా! మనపని పూర్తికాలేదుసుమా. తపనుడూ, ఛాయా మేలుకొని ఒకళ్ళనొకళ్ళు చూసుకుని సంతోషపడతారుగాని, అవతల ఒడ్డునవున్న వనరమా, వసంతుడూ మేలుకుని ఆనందించలేరు. ఏమంటే, ఆ మాతంగిమూలాన్ని వసంతుడు లేచి ఛాయకోసం పలవరిస్తూనే ఉంటాడు. ఈ మాతంగికి విరుగుడు లేదా?" అన్నాడు.

'లేకేమి?' అంటూ అనిలుడు వెంటనే నాలుగాకులేవో తెచ్చాడు. అనిలుడు వసంతుని రెప్పలమీద ఈ పసరు పిండేసరికి, తేనె విరిగిపోయి అతడు మునుపటిలాగానే వనరమను ప్రేమించాడు. ఛాయా తపనులూ, అవతలవున్న వనరమా వసంతులూ నిద్రలేచారు. మాయనది మాయమైంది. అంతా కలగా తోచింది. నలుగురూ సంతోషంగా వెళ్ళిపోయారు.

మరి ఒక్క క్షణంకూడా మన్మథుడు ఆగలేదు. అతడు రతీదేవి అంతఃపురానికి వెళ్ళేసరికి ఆమె నిద్రపోతోంది. నిద్రలో కూడా ఆమె కళ్ళల్లో కోపం అలా కనపడుతూనే ఉంది! మన్మథుడు ఆ కంటిమీదా, ఈ కంటిమీదా తానుతెచ్చిన మాతంగి చుక్కలు వేసేసి, ఆమె లేచేవేళకి కనిపెట్టుకు కూర్చున్నాడు.

రతీదేవి లేచింది. ఆమెకోపమంతా ఏమయిందో! "ఎక్కడికి వెళ్ళేవు మన్మథా? నాకు కోపంవస్తేమాత్రం వెళ్ళిపోతావా? ఇంకెప్పుడూ వెళ్ళనని ఒట్టేసుకో' అంటూ అతని చెయి తీసుకుని ఆమె తనచేతిలో ఉంచుకున్నది.

"ఇంక నీ కసలు కోపమే రాదులే!" అన్నాడు కీలకమెరిగిన మన్మథుడు ముసిముసినవ్వులు నవ్వుతూ.






# పొంగిన పౌరుషం

మనదేశాన్ని - కొంతకాలం మొగల్ పాదుషాలు ఏలిన సంగతి తెలుసుకదా! ఆ పాదుషాలలో ఒకడు ఔరంగజేబు. ఔరంగజేబు పరిపాలన చాలా దుష్టంగానూ, క్రూరంగానూ వుండేదని చెప్పుకొంటారు. అతడు పరమతద్వేషి. కనుక, అన్నిమతాల వారినీ, ముఖ్యంగా శిఖుమతస్థులనూ ఎన్నోవిధాల హింసించేవాడు.

అతడుపెట్టే యాతనవల్ల ప్రజలలో భయం అలుముకుంది, ఆత్మవిశ్వాసం నశించింది. రోజురోజూ పరిస్థితులు విషమిస్తూవచ్చినై.

ఇటువంటి పరిస్థితులలో గురుగోవింద సింగ్ అనే పిన్నవాడు శిఖులకు నాయకుడైనాడు. వయసుకి పిన్నవాడైనా గురుగోవిందు గొప్ప పరాక్రమశాలి. బుద్ధికుశలుడు. నాయకత్వం వహించటానికి అన్నివిధాలా తగినవాడు.

అతడు గద్దె యెక్కుతూనే దేశస్థితి, ముఖ్యంగా తన ప్రజలస్థితి ఎలావున్నదా అని పరిశీలించాడు. చూడగా, ముందుకు రావలసిన యువకులందరూ పౌరుషహీనులుగా, పిరికిపందలుగా తయారై కూర్చున్నట్టు కనిపించింది. ముందు తనవారిని బాగుచేసుకుంటే దేశం దానంతట అదే బాగుపడుతుందని నిశ్చయించాడు.

ఈ నిశ్చయంతో ఒకరోజున ఒక విశాలమైన తోటలో మకాంచేసి, రాజ్యంలోని యువకులందరినీ అక్కడికి రప్పించాడు. అందరూ సమావేశమై గురుగోవిందు ఏమి చెబుతాడోనని చెవులు రిక్కించుకుని కూర్చున్నారు.

వారనుకొన్నట్టు, అక్కడ ఉపన్యాసాలు వినటానికి తగినయేర్పాటులేమీ కనిపించలేదు. మరుక్షణంలో డేరాగుమ్మానికి వుండే తెర తొలగించుకొని, విచ్చిన ఖడ్గం చేత

ఎస్. కమలాకుమారి - ఏలూరు



పుచ్చుకొని, చెప్పనలవిగాని ఉద్వేగంతో గురుగోవిందసింగు ఇవతలకు వచ్చాడు.

వచ్చి, కత్తి ఝుళిపిస్తూ : "స్వాతంత్ర్య పీఠానికి బలి అయేటందుకు స్వచ్ఛంద సైనికులు కావాలి నాకు. ఎవరు వస్తారో రండి!" అన్నాడు, గంభీర భీకరస్వరంతో.

యువకులంతా ఒకరివంక ఒకరు చూచుకున్నారు. గురుగోవిందుని చేతిలో తళతళ మెరుస్తూవున్న ఖడ్గంవేపు చూచారు. ఒక్కొక్కరే జారుకోసాగారు.

ఉన్నట్టేవుండి, ఒక యువకుడు లేచి నిలబడ్డాడు. "బలికావటానికి నేను సిద్ధంగా వున్నా"నంటూ ముందుకువచ్చాడు. అతడి పేరే భాయీ దయాసింగు. గోవిందసింగు అతనిని తన డేరాలోపలికి తీసుకపోయాడు. అలా తీసుకపోగానే ఒక మనిషిని తెగవేసిన చప్పుడు వినవచ్చింది! వెంటనే నెత్తురోడు తున్న తన ఖడ్గంతో గురుగోవిందు మళ్ళీ డేరాబయటికి వచ్చి, "ఇంకా ఎవరైనా వున్నారా?" అని ప్రశ్నిస్తూ చకచకమని కత్తి ఝుళిపించాడు.

"నేను! నేను!!–"అంటూ ఆమట్టునే మరినలుగురు యువకులు ముందుకు వచ్చారు. వారినికూడా గురుగోవిందు లోనికితీసుకుపోయాడు. మళ్లీ ఈసారి నలుగురను నరికిన చప్పుడయింది!!

రక్తం చిందే తనఖడ్గం ఝుళిపిస్తూ మళ్లీ అతడు డేరా ఇవతలకు వచ్చాడు. బలి కాదలచిన త్యాగులను మళ్ళీ ఆహ్వానించాడు. ఆనాడు అక్కడ సమావేశమైన శిఖ్ఖుయువకులందరూ, ఒక్కడూ మిగిలిపోకుండా ముందుకువచ్చారు.

యువకులేకాదు, పెలిస్తేచాలు, కోరి బలికావటానికి అందరూ కుతూహలం కనబరిచారు. అందరూ చూస్తూవుండగా, డేరా గుమ్మానికి వుండే తెర మళ్ళీ ఒక్కసారి తొలగింది. అప్పుడు నాయకుడు గురు



గోవిందసింగు ఉత్సాహంతోవచ్చి అందరకూ మధ్యన నిలబడ్డాడు. బలికి సిద్ధమై ఇంతకు ముందు డేరాలోపలికి పోయిన స్వచ్ఛంద సైనికులు ఐదుగురూ ఒకరొకరుగా వచ్చి వరుసగా నిలబడ్డారు. అక్కడ సమావేశ మైన ప్రేక్షకుల ఆశ్చర్యానికి మేరలేక పోయింది!

అందరూ జేజేలు కొడుతూ వుండగా, గురుగోవిందు "మన జాతిలో పౌరుషం ఎంతమాత్రం నశించలేదు అని రుజువు చేసిన శూరులు, వీరులు ఈ ఐదుగురున్నూ. వీరే జాతిరత్నాలు, నా ప్రియశిష్యులు. శత్రుహింసకు తట్టుకోలేక, సరిఐన నాయ కత్వంలేక, ప్రజల పౌరుషం ఇప్పటివరకూ అణగారిపోవటంచేతనే వారు నివురు గప్పిన నిప్పులాగా ఉండవలసి వచ్చింది. ఇటువంటి మహాత్యాగులు నాకు అండగా వుంటే శత్రువును తునుమాడటానికి క్షణం సేపు పట్టదు. లేవండి, శత్రుసంహారం చేసే వరకూ ఈ నాఖడ్గాన్ని దించబోయేదిలేదు" అంటూ ఉత్తేజకరమైన పలుకులు పలికే సరికి ప్రేక్షకులలో దాగివున్న పరాక్రమం విజృంభించింది. ఒకేసారి అందరూ మహా వీరులుగా మారిపోయారు!

అప్పుడు గురుగోవిందు డేరా విప్పించి వేశాడు. అందరూ ఆశ్చర్యపడేటట్టుగా అందులో మెడలు తెగిపడివున్న ఐదు మేక పోతులు కనిపించినై. వాటిని చూడగానే, తమలో అణగారివున్న పౌరుషాన్ని పైకి ఉబికించటానికి నాయకుడుచేసిన వీర కృత్యం వెల్లడిఐంది. అందరూ ఆతనిని ఎంతగానో కొనియాడారు. అప్పుడు గురు గోవిందసింగు ఆ మేకపోతులను పసందుగా వండించి, సమావేశమైన అందరకూ అక్కడనే విందుజరిపించాడు. గురుగోవిందు నికి ప్రియశిష్యగణమైన ఆ ఐదుగురు యువకులకూ 'పాంచ్ ప్యారే' అనిపేరు.



# కాలకేతు

పూర్వకాలమందు కాంచనపుర రాజ్యాన్ని కాలకేతు అనెరాజు పాలించుతూ ఉండే వాడు. కాలకేతు మహాగర్వి. తనే సర్వశక్తుశననీ, తనను పుట్టించిన బ్రహ్మకూడా తనజోలికి రాలేడనీ ఒకవిధమైన దురహంకారం అతన్ని పట్టిపీడిస్తూండేది.

'ఈ నడుమంతరపు సిరి నిలిచేదికాదు. ఇది చూచుకుని మిట్టిపడబోకుమా!' అంటూ అతనిక్షేమం కోరినవాళ్ళు చిలకకు చెప్పినట్టు చెబుతూవచ్చారు. అధికార గర్వంతో వున్న కాలకేతుకి ఇటువంటి మంచిమాటలేవీ చెవికి ఎక్కేవికావు. చిన్నా పెద్దా తారతమ్యం లేకుండా, అందరనూ తృణీకరించేవాడు. రాజపదవినుండి తనను తప్పించటానికి ఎవ్వరికీ తరంకాదని అతని ధీమా. ఈ ధీమావల్లనే అతనిలో చెప్పలేని అహంకారం చెలరేగుతూ వచ్చింది. ఇది ఇలా వుండగా—

కాంచనపురరాజ్యానికి ముఖ్యనగరంలో ప్రసిద్ధిగాంచిన ఒక దేవాలయమున్నది. ఆ దేవాలయంలో ప్రతిఏటా అతివైభవంగా గొప్ప గొప్ప ఉత్సవాలూ సమారాధనలూ జరుగుతూవుంటై.

తను సింహాసనం అధిష్ఠించినతరువాత కాలకేతు తొలిసారిగా ఆ దేవాలయంలో ఉత్సవం చూడటానికని మంత్రిసామంతులతో, వందిమాగధులతో, సమస్తమైన పరివారంతో బయల్దేరాడు.

రాజు చేరుకొనేసరికి ఆలయంలో పండితులు పురాణాలు చదువుతున్నారు. పురోహితులు స్వరయుక్తంగా మంత్రాలు చదువుతున్నారు. పురోహితుడు మొదటి శ్లోకం చదువుతూ ఉండగా రాజువచ్చి గుడిలో ప్రవేశించాడు.

ఆ శ్లోకానికి అర్థం యిది: 'ఈశ్వరా! నీవు సర్వశక్తిమంతుడవు. సంకల్పమాత్రం

డి. జమదగ్నిశర్మ - మదనపల్లి




చేతనే ప్రభువును సేవకునిగాను, సేవకుని ప్రభువుగానూ చేయగలవుకదా !' అని.

ఈ శ్లోకం చదువుతూవుండగా కాలకేతుకి తేళ్ళూ జెర్రులూ పాకుతున్నట్టయింది. శ్లోక మంతా విన్న తరువాత అతడు, సహజసిద్ధ మైన తన అహంకారంతో "హ! దేవుడు సంకల్పిస్తాడట! తలుచుకుంటే, రాజును సేవకునిగా, సేవకుని రాజుగా మారుస్తాడట!! వెర్రిబాగుల పండితులు! అర్థంలేని పిచ్చి శ్లోకాలు !!—" అనుకొన్నాడు మనస్సులో, నిరసనభావంతో.

అలా మథనపడుతూవుండగానే, ఏదో తెలియని మైకంపట్టి కాలకేతును వశ పరుచుకుంది. ఆవులించి, కన్నులు మూశాడు. ఆ మత్తునుండి మెలకువవచ్చి లేచేసరికి, చుట్టూ చీకటిమయంగా వున్నది! తనతో వచ్చిన మంత్రిసామంతులు లేరు, వందిమాగధులు లేరు, పరివారం లేదు. మినుకుమినుకుమనే దీపకాంతిఐనా సమీపంలో ఎక్కడా కానరాలేదు.

కాలకేతుకు కంగారుపుట్టింది. వొళ్లంతా ముచ్చెమటలు పోసినై. గొంతు అరుకు పోయింది. ఆ చీకటిలోనే తడుముకొంటూ పోయి, ఎలాగో తలుపు ఉండే తావు తెలుసు కున్నాడు. దబదబా తలుపులు బాదుతూ, "తలుపుతీయండయ్యా! నేను రాజును! కాలకేతు మహారాజును!! తలుపు తెర వండి!!!" అంటూ, గుడి ప్రతిధ్వనించేలాగ గొంతుచించుకు అరిచాడు.

ఈ కేకలు ఆలయంలోపలినుంచి వస్తు న్నాయి. దేవాలయం అవతల కాపలా వాళ్ళున్నారు. వాళ్ళకు ఈ కేకలు వినబడ గానే ఆశ్చర్యపడి, "ఇప్పుడేకదా ప్రభువు వారు పూజాపునస్కారాలు ముగించుకుని వెళ్లిపోయారు? వారు వెళ్ళడం కళ్ళారా చూచామే? ఇదేమిటి 'నేను రాజును, నేను కాలకేతుమహారాజును!' అని కేక



లేస్తున్నాడే, వీడెవడన్నా పిచ్చివాడా, త్రాగుబోతా?' అని వాళ్లలోవాళ్లు వాదించుకోజొచ్చారు.

ఎలా ఐతేనేం? కావలివాడు తటపటాయిస్తూనే తలుపుతెరిచేటంతలో, మెరపులాగా ఎవరోవ్యక్తి ఆ చీకటిలోకి దూసుకుపోవటం గమనించాడు. ఐనా, మనకెందుకనుకొని వాడు చల్లగా ఊరుకొన్నాడు.

ఇలా పరుగుచ్చుకున్న కాలకేతు క్షణంలో రాజభవనం చేరుకొన్నాడు. "ఎవరక్కడ? మేము దేవాలయంలో నిద్రిస్తూ వుండగా, మా అనుజ్ఞ తీసుకోకుండా ఈ మంత్రిసామంతులూ, వందిమాగధులూ ఎలా వదిలివచ్చేశారు? ఈ అవిధేయుల్ని పట్టి బంధించండి!!" అని పరివారానికి అజ్ఞాపించాడు.

"బంధించండి! పిచ్చివాడు!! వీడు రాజభవనంలోకి ఎలా రాగలిగాడు!!!" అంటూ సేనానాయకుడు భటులకు అజ్ఞాపించాడు. మరుక్షణంలో కాలకేతు మణిబంధాలకు సంకెళ్లు తగిలించి, రాజుఎదుట నిలబెట్టారు.

కాలకేతురూపంలో వున్న దేవదూత రాజును చూస్తూనే మందహాసంచేశాడు. 'ఎవరు నీవు?' అని ప్రశ్నించాడు.

"నేనా! నేనా!! హ!!!—" అంటూ కాలకేతు హుంకరించాడు. కొంచెం పస్తాయించి, "నేను, కాలకేతుమహారాజును. తెలిసిందా?" అని బదులుచెబుతూ, భటులవైపు తిరిగి "వీడు మోసకారి. నా వేషం వేసుకువచ్చాడు. వీడిని బంధించండి!" అని ఎలుగెత్తి అరిచాడు.

మారువేషంతోవచ్చిన దేవదూతకు కాలకేతులో అతిశయిస్తున్న అహంకారం చూచి నవ్వుపుట్టించింది.

"వీడెవడో త్రాగుబోతు. అయినా తెలివి తప్పకుండానే మాటాడుతున్నాడు. మన

ఆస్థానంలో హాస్యగాడుగా ఐనా పనికి రావచ్చు. నిషా దిగేవరకూ ఖైదులోపెట్టి వుంచండి" అన్నాడు.

వెంటనే భటులు అతనినితీసుకుపోయి దుర్గంధపూరితమైన ఒక చీకటికొట్టులో బంధించారు. ఒకవంక అతడు "నేను ఎవరనుకొన్నారో! మహారాజును!! కాల కేతును!!!" అంటూ అరిచే అరపులకు ఎవ్వరూ లెక్కచేయక, పిచ్చివానిని చూచి నవ్వినట్టు పకపక నవ్వి, హేళనచేయ సాగారు.



మరికొద్దిరోజులకు దేవదూత, రాజభవ నంలో ఒక బ్రహ్మాండమైన విందు ఏర్పాటు చేశాడు. ఆ విందుకు దేశదేశాలనుండి సామంతరాజులందరూ వచ్చారు. దర్బారు కలకల్లాడుతూ వుంది.

మహామహులందరూ సమావేశమై ఉండగా ఖైదులోవున్న కాలకేతును తీసుకు రమ్మని ఆజ్ఞాపించాడు దేవదూత. ఆప్రకారం కాలకేతును తీసుకువచ్చారు.

పాపం!-అతని అవస్థ ఏమనిచెప్పేది? రంగురంగుల గుడ్డపేలికలతో కుట్టిన దుస్తులు అతడు ధరించినవి. నెత్తిమీద హాస్యగాడు పెట్టుకునే కుచ్చుటోపీ. చేతిలో ఒక బారెడు పొడుగుగల వంకరటింకర కర్ర. బుజంమీద కిచకిచలాడుతూవున్న కోతిపిల్ల ఒకటి!

ఆ వచ్చిన రాజాధిరాజులందరకూ వానిని చూపిస్తూ దేవదూత—"ఇతడెవరో మీకు తెలుసా?" అని అడిగాడు. ఈ మాటకు కాలకేతు పళ్లు పటపట కొరుకుతూ, "అయ్యా, నన్ను గుర్తించలేరా? నేను అసలు కాలకేతుమహారాజును. వీడెవడో నావేషం వేసుకువచ్చి మాయనాటకం ఆడు తున్నాడు!" అని వారందరినీ ప్రశ్నించాడు.

వారంతా పొట్టచెక్కలయ్యేలా నవ్వి, "వీడెవడో, కొంచెం తలబిరుసుగాని తెలి

వైన వాడే! బలేహాస్యగాడు !!" అంటూ కాలకేతుకేసి చూచి వేళాకోళంచేశారు. కాలకేతు ఉస్సురన్నాడు.

ఇలా వుండగా, ఒకరోజున రాజు రూపంలో ఉన్న దేవదూత కాలకేతును అంతఃపురంలోకి పిలిపించాడు.

"నువ్వెవరవు? ఇప్పుడైనా సరిగా చెబుతావా?" అని అడిగాడు. ఈ ప్రశ్న వింటూనే కాలకేతు కుప్పగా కూలిపోయాడు.

కొంతసేపటికి తేరుకుని, తెలివిలో పడి, "నేనా?—మహారాజా! నేను పిచ్చివాణ్ణి. మానవబలాన్నీ దైవబలాన్నీకూడా ధిక్కరించిన మహాగర్విని. అహంకారపూరితుణ్ణి. బుద్ధిహీనుణ్ణి. దైవబలం లేక, నా ప్రజలే నన్ను గుర్తించలేకపోయారని యిప్పుడు తెలుసుకొన్నాను. కళ్ళుతెరిచాను. నాగర్వం అణిగింది. అహంకారం నశించింది. దీనుణ్ణి. ప్రజకు దాసుణ్ణి" అని ఆవేశంతో కాలకేతు భోరున ఏడవసాగాడు.

అప్పుడు దేవదూత తృప్తితో తలవూపాడు. రెండుచేతులూ యెత్తి దీవిస్తూ—"నీలో గర్వం, అహంకారం నశించినై. నిజంగా ఇప్పుడు నీవు రాజువి. మహారాజువి. కాలకేతువి!" అన్నాడు.

మరుక్షణంలో చూతామంటే, దేవదూత మరి కనిపించలేదు. కాలకేతు ధరించిన రంగుపేలికలన్నీ రాజోచితమైన దుస్తులుగా మారిపోయినై. నెత్తిమీది కుచ్చుటోపీ కాంతులు వెదజల్లే నవరత్నఖచితమైన కిరీటంగా తయారైంది!

కొద్దిరోజులకల్లా మళ్ళీ కాలకేతు ఆ దేవాలయంలో ఇంకా గొప్పగా ఉత్సవాలు ఏర్పాటుచేశాడు. ఈసారి పురోహితులు వర్ణించిన శ్లోకాలు మహారాజుకు ఆనందాన్ని కలిగించినయేకాని, వెగటు కాలేదు. ఈసారి ఈశ్వరశక్తికీ జనవాక్యానికీ వినయుడై ఆతడు జేజేలు పలికాడు!! నాటినుండీ కాలకేతు ప్రజలందరకూ ఇష్టుడైనాడు.






లోకంలో 'ఎవరు యెక్కువ?' అని చెప్పి ఒకప్పుడు వేదాంతికీ రైతువాడికీ 'మధ్యని వాదం పడింది. 'ఎన్నాళ్ళుచూచినా కలుపు తీయటం, దుక్కిదున్నటం, నూర్చటం—ఇదే పనిగావున్నదే నీకు. భూమిలో కలుపే కాదు, నీమనసులోని కలుపు తీసెయ్యాలెనోయి ఓడ్డా! లేకుంటే ఆ చెట్టుకూ నీకూ తేడా యేముంది?' అన్నాడు వేదాంతి.

అందుకు రైతువాడు 'అయ్యా. వేదాంతి గారూ!—మీకంటె సంఘానికి నెనే ఎక్కువ ఉపకారిననే సంగతి మీకు తెలియదు కాబోలు. మీరు బోధించే వేదాంతం లేకపోయినా లోకం జీవించగలదు. నేను పండించే ధాన్యాలు లేకుంటే మీరు నిమిషం కూడా నిలువలేరు సుమండీ!' అన్నాడు.

వేదాంతి ఆలోచనలో పడ్డాడు.

అప్పుడు రైతువాడు 'ఆలోచన ఎందుకు? ఒక చిన్నకథ చెబుతా వినండి: ఇలాగే ఒకప్పుడు ఒక రాయికీ మట్టిబురదకీ వివాద వచ్చింది. 'నేను చూడు. ఎంత బలంగా, శుభ్రంగా, ముచ్చటగా వున్నానో' అని గర్వంతో అన్నది రాయి. అలా అని వూరుకోక, 'ఛీ!, నువ్వేమిటి, ముట్టుకుంటే పిసపిసలాడిపోతావు. నిన్ను తొక్కితే మానవులు అసహ్యించుకుంటారు. కాళ్లు కడుక్కొనేదాకా వాళ్లకు తోచనేతోచదు' అంటూ హేళనకూడా చేసింది.

గర్వి అయిన రాయి ఇలా అనగానే మట్టి బురదకు పౌరుషం వచ్చింది: 'ఓ పాషాణమా!—చూడటానికి నేను అసహ్యంగానే ఉండవచ్చు. ఐతే, మానవుడి ప్రాణాలను నిలబెట్టే పంటలకు జీవంపోసేది ఎవరో తెలుసా? నేనే' అని తెగేసి జవాబు చెప్పింది' అన్నాడు రైతువాడు.

రైతుచెప్పిన ఈ కథకు వేదాంతి "ఓయి పెద్దమనిషీ!—మట్టిబురద చెప్పిన జవాబు

వై. జ్ఞానాంబ - జగదల్పూర్

కాదనలేము. కాని, రెండోపక్షంకూడా ఆలోచించాలి. బురద సాయంతో పంటలు పండుతూవుంటే—గొప్పగొప్ప భవనాలు, గుడులూ, గోపురాలూ నిర్మించడానికి శిలలు వినియోగమవుతున్నాయి. కనుక, దేని ఉపయోగం దానిది. రెండూ లోకానికి అవుసరమే" అని వాదించాడు.

ఆమీదట 'సరే. దారికి వస్తున్నారు మీరు. ప్రతిమనిషి ఉపయోగమూ, ప్రతివస్తువు ఉపయోగమూ ప్రపంచానికి ఉన్నదని వప్పుకొంటున్నారుకదా, విన్నారో లేదో-మరొక్క చిన్న కథ చెప్పనివ్వండి. విని తరువాత మీ అభిప్రాయం చెబుదురుగాని'. అంటూ, ఇలా చెప్పాడు రైతువాడు:

"ఒక అడవిలో ఒక మర్రిచెట్టూ, ఒక టేకుచెట్టూ రెండూ వుండేవి. ఒకప్పుడు మర్రిచెట్టు టేకిచెట్టుతో "నేను లక్షలాది జీవులకు నీడనిస్తాను. చేటలంతేసి ఆకులున్న వన్నమాటేగాని, నీవల్ల కొంచెమైనా మానవునికి ఉపకారం లేదుకదా!" అని దెప్పిపొడిచింది.

అందుకు టేకుచెట్టు 'గర్వించిన ఓ మర్రీ!—నీ అహంభావం కట్టిపెట్టు, నీవు ఏపాటి? నీవుఇచ్చే నీడ ఏపాటి? నా కలపతో మానవులు శాశ్వతమైన యిళ్ళు కట్టుకుని తరతరాలా హాయిగా కాలక్షేపంచేస్తారు' అంటూ తలవంచుకునేటట్టు మర్రికి జవాబిచ్చింది."

రైతువాడు ఈ కథ చెప్పగానే, వేదాంతి వాడిని ఆదరించి చేరదీసుకున్నాడు: 'అబ్బాయీ!—ఐతే యిప్పుడు—నువ్వు శరీరానికి నీడనిచ్చే మఱ్ఱిచెట్టువి, నేను మనసుకు శాంతినిచ్చే టేకుచెట్టును. పంటకు జీవాన్నిచ్చే మట్టివి నువు, మనసుకి రక్షణనిచ్చే శిలను నేను. తెలిసిందా? ఒకరు ఎక్కువ, ఒకరు తక్కువ అనేదిలేదు, లోకానికి మనిద్దరమూ అవసరమే' అని చక్కగా ప్రబోధించేశాడు.



1

2





# నేటి పాపలు  రేపటి పౌరులు





3

4

1. చి॥ అనంద్ - మదరాసు

2. చి॥ లక్ష్మీకాంతమ్మ - కడప

3. చి॥ క. విజయకుమారి-అశ్వారావుపేట

4. చి॥ బా. బాలభాస్కరరావు-రాజమండ్రి

# అట్టమీంది బొమ్మ

మహాభారతంలో పంచపాండవులను ఎరుగనివారుండరు. పాండవుల తండ్రి పాండుమహారాజు. ఆయనకు పట్టపురాణి కుంతి. కిందముడనే మహాఋషి ఒకప్పుడు పాండురాజును సంతానంలేకుండా శపించివేశాడు. ఆ విరక్తితోటీ పాండురాజు 'శతశృంగ'మనే కొండప్రదేశానికి పోయి, అక్కడ జీవితం గడుపసాగాడు.

కుంతీదేవికి ఒకప్పుడు దూర్వాసమహర్షి మంత్రోపదేశం చేసి, 'దీనిని పఠించి నీయిష్టంవచ్చిన దైవాన్ని తలుచుకో. ఆ దైవం నీకు ప్రత్యక్షమై పేరుతెచ్చే పుత్రుణ్ణి ప్రసాదిస్తాడు' అని చెప్పిపోయాడు.



ఈరహస్యం ఆమె తనభర్తతో వెల్లడించేసరికి, పాండురాజు సంతోషించి ముందుగా ధర్మజ్ఞుడైన కొడుకు వుండటం మంచిదని సలహాయిచ్చాడు. భర్త ఆజ్ఞప్రకారం ఆమె ధర్మదేవతను ఆహ్వానించి, వరప్రసాదంగా యుధిష్ఠిరుడనే శిశువును కన్నది.

తరువాత—క్షత్రియులకు భుజబలం అవసరంగనుక, మహాబలుడైన కొడుకు కావాలని పాండురాజు తనకోరిక వెల్లడించగా, కుంతిదేవి వాయుదేవుని అనుగ్రహం సంపాదించి భీముడనే బలశాలిని కన్నది. ఇలానే పంచపాండవులూ పుట్టారు.

అందరిలోకీ రెండవవాడైన భీముని పుట్టుక అతి చిత్రమైంది. భీముడు పుట్టిన పదవనాడు కుంతి నదిలో స్నానంచేసుకుని పూజకై ఇంటికి వస్తూన్నది. భర్త కూడానే వున్నాడు. అకస్మాతుగా ఒక భయంకరమైన పెద్దపులి గాండ్రుపెడుతూ వచ్చింది. పులి కంటపడగానే కుంతి హడిలిపోయి ఒకగుట్ట మీదికి యెక్కింది.

అలా ఆమె తత్తరపడి గుట్ట ఎక్కటంలో ఒడిలో వున్న శిశువు ఆమెకుతెలియకుండానే దభీమని కింద పడిపోయాడు. ఇదిచూచి పాండురాజు బాణంయెక్కుపెట్టి పులిని చంపివేశాడు.

కుంతి కంగారులో బిడ్డడు రాతిమీద పడిపోయాడేకాని, వాడికి కొంచెమైనా దెబ్బతగలలేదు. పైగా, పసివాడి ధాటికి ఆ రాయే ముక్కలుగా బద్దలైపోయింది! వాడు ఉయ్యాలలో పడుకుని ఆడుకున్నట్టుగానే ఎంతో ఉత్సాహంతో నవ్వుతూ ఆడుకోసాగాడు. అద్భుతమైన వాని బలంచూచి అందరూ అమితాశ్చర్యపోయారు. మహాబలుడు, పరాక్రమవంతుడు అయిన ఈ భీముడే పెరిగి పెద్దవాడై అనేకమంది రాక్షసులను సంహరించాడు.

# అట్టచివరి బొమ్మ

ఆ సాయంకాలానికల్లా ఫాదుషావారి దివ్య భవనంలో దర్బారు యేర్పాటయింది. దేశదేశాలనుండి విచ్చేసిన ప్రముఖులతో దర్బారు నిండిపోయి, కన్నుల వైకుంఠంగా కలకలలాడుతూవుంది!

ఆ ప్రముఖుల సమూహంలో మన వంటలచిన్నదికూడా వున్నది. అన్నట్టు... యిప్పుడు ఆ వంటలచిన్నదానికి పెద్ద వుద్యోగం లభించింది! ఏమీ అంటే—అపురూపమైనటువంటి, బుల్‌బుల్ పిట్టకు ఆమె నేస్తురాలు ఐవుండటం—స్వయంగా పోయి ఆ పిట్టను ఆహ్వానించటం-ఫాదుషావారిని మధుర గానంతో సంతోషపెట్టటానికని ప్రత్యేకించి, చెట్టుపైన వుండే ఆ పిట్టను దివ్యభవనానికి తీసుకరావటం ఇందువల్లనే వంటలచిన్నది వంటశాలకు ముఖ్యురాలుగా నియమింపబడింది.



ఈవిధంగా పెద్ద ఉద్యోగం సంపాదించిన వంటలచిన్నది దర్బారులో ఒక ద్వారంవద్ద తలుపువాటున నునుసిగ్గుతో నిలబడివుండి, తనివితీరా ఫాదుషావారిని తిలకిస్తూవున్నది!

నిండుదర్బారులో అపురూపమైన బుల్‌బుల్‌పిట్ట అత్యద్భుతంగా పాడటానికి ఆరంభించగానే సభలో అందరకూ హృదయాలు ద్రవించిపోయినై. ఫాదుషావారి రెండు కన్నులనుండీ అప్రయత్నంగా ఆనందబాష్పాలు రాలి, వారి చెక్కిళ్లమీదినుంచి దిగజారినై.

బుల్‌బుల్ పాటకు ఫాదుషావారు తన్మయులై మెచ్చి, దానిని సరవాతీరేటట్టుగా అలంకరిస్తామనే వుద్దేశం సెలవిచ్చారు. ఐతే, 'అటువంటి ఆడంబరాలేమీ నాకువద్దు ప్రభూ! మీ దయవుంటే చాలు' అంటూ పిట్ట వినయంతో మనవిచేసుకొంది.

అనాటినుంచీ రాజ్యంలో ఎక్కడ విన్నా బుల్‌బుల్ పిట్ట అమరగానాన్ని గురించిన ప్రసంగమే!

ఫాదుషావారు దానికి సమస్తమర్యాదలూ జరిపించారు. అది తన బంగారు పంజరంలో ఉండటం, లేదంటే గాలిలో స్వేచ్ఛగా విహరించటం. బుల్‌బుల్‌పిట్ట విహరించటమంటే సామాన్యమైన విషయంకాదు. అదీవక చిత్రమే. పన్నెండుమంది జవానులు పన్నెండు పట్టుదారాలు తీసుకవచ్చి, పిట్టకాళ్లకు తగిలిస్తారు. ఆ పన్నెండు పట్టుదారాలలో ఒక్కొక్కళ్లు ఒక్కొక్కటి చేతపట్టుకుని పిట్టను ఎగరెస్తూవుంటారు. ఇదీ పద్ధతి.

# రంగుపెన్సిళ్ల తమాషా

# ఇంద్రజాలం

ఇంద్రజాలికుడు ఒక పెన్సిళ్లపెట్టె తీసుకునివచ్చి చూపిస్తాడు. అందులో, ఎర్రపెన్సిల్, తెల్లపెన్సిల్, ఆకుపచ్చపెన్సిల్, నీలిపెన్సిలు—ఇలా రంగురంగుల పెన్సిళ్ళు ఉంటాయి. ప్రతిపెన్సిలూ ఇత్తడికాప్ కాని, సెల్యులాయిడ్ కాప్ కాని ఉన్న పెన్సిళ్ళయి ఉండాలి. ఇలాంటి పెన్సిళ్ళు బజార్లో ఏషాపులోనయినా అమ్ముతారు. ఇంద్రజాలికుడు ఆ పెన్సిళ్ళను ప్రేక్షకులకు చూపి ఇందులో ఏమీ మర్మం లేదని నిర్భయంగా చెప్పాలి.

ప్రేక్షకులు ఏపెన్సిల్ ఎర్రటిదో, ఏపెన్సిల్ పచ్చటిదో కాగితంమీద గీతలు గీసి పరీక్షిస్తారు. అప్పుడిక ప్రేక్షకులవద్ద నుంచే ఒక టోపీతీసుకుని, ఈ పెన్సిళ్లు అందులో వేసి కలిపి వేసెయ్యాలి. ఆ తర్వాత ఇంద్రజాలికుడు చేతికి అందులోంచి ఒక పెన్సిల్ యిస్తే అతడది చూడకుండా ఏరంగుపెన్సిలయిందీ సులభంగా చెప్పేస్తాడు.




చూడకుండా ఎలాచెప్పగలిగాడా అని అందరూ ఆశ్చర్యపోతారు. చూడకపోయినా చేతులు వెనక్కి పెట్టుకుని ఉన్నప్పుడు దాంతో గోరుమీద గీతగీసుకుని ఆ గీతనుచూసి ఇంద్రజాలికుడు చెప్పగలిగాడని కొంతమంది అనుకోవచ్చు. —కాని అసలు కిటుకు అదికాదు. చీకటిలో ఉండికాని, లేదా కళ్ళకు గంత కట్టుకునికానికూడా ఏరంగు పెన్సిలయిందీ చెప్పగలుగుతాడు. ఎలా చెప్పగలుగుతున్నాడు?

ఈ తమాషాలో ఈ పెన్సిళ్ళకుండే ఇత్తడికాప్‌లే చాలా సహాయపడతాయి. ఈ ప్రక్కనున్న చిత్రంచూస్తే ఆ విషయం స్పష్టంగా బోధపడుతుంది.

# జాలము

బజారులో ఇత్తడి క్యాప్‌లూ, రబ్బరు క్యాప్‌లూ ఉన్న పెన్సిళ్లలాంటివి అమ్ముతారు. ఇంద్రజాలికుడు ఈ కాప్ లున్న పెన్సిళ్ళను కొని, కాప్ ఊడతీసి, 1, 2, 3, 4, 5. 6 ఈ నెంబర్లప్రకారం సూచించినట్లు పెన్సిళ్ల వెనకభాగం కొద్దిగా చెక్కి మళ్లీ కాప్‌లుపెట్టేసి—ఆ పెన్సిళ్లనే దగ్గర ఉంచుకోవాలి, వెనుకవైపున అర్ధచంద్రుడిలా చెక్కి ఉన్న పెన్సిల్ ఎర్రపెన్సిల్. మధ్యలో గాడిలాగా చెక్కి ఉన్న 2 నెం. పెన్సిల్ నీలం, '+' ఇలా చెక్కి ఉన్నపెన్సిల్ పసుపు పచ్చ, అలాగే మిగతా పెన్సిళ్లన్నీ రకరకాలుగా చెక్కి గుర్తుంచుకోవాలి.




ఇంద్రజాలికుడి చేతికి పెన్సిల్ ఇవ్వగానే చేతులు వెనక్కి పెట్టుకుని ఉన్నవాడలాగే ఇతరులకు తెలియకుండా దానికాప్ ఊడతీసి ఆ చెక్కి ఉన్న గుర్తును తడిమిచూసుకుని ఫలానారంగు పెన్సిల్ అని—పెన్సిల్ వెనకపెట్టుకునే చెప్పేస్తాడు. అతడి కళ్లకు గంతకట్టినా ఏరంగు పెన్సిల్ అయిందీ చెప్పగలడు. అంతేకాదు, ఈ పద్ధతిని అసలు గ్రుడ్డివాళ్ళుకూడా ఈ ఇంద్రజాలం చేయగలుగుతారు.

---

ఈ గారడినిగురించి పాఠకులు ఇంకావివరంగా తెలుసుకోదలిస్తే, 'చందమామ' పేరు ఉదహరిస్తూ సరాసరి ప్రొఫెసరుగారికి వ్రాయవచ్చు. ఉత్తరాలు ఇంగ్లీషుభాషలోనే వ్రాయాలి. ఇదిముఖ్యం.

అడ్రెసు : ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజీషియన్
12/3/A. జమీర్‌లేన్, బాలిగంజ్, కలకత్తా - 19



పంపినవారు :
సి. హెచ్. హనుమాయమ్మ - గూడూరు

గతనెల చందమామ 12-వ పేజిలోని 'తప్పుపట్టండి' బొమ్మకు సమాధానాలు:

1. పక్షికి కాళ్ళు ఉండాలి.
2. చాకు కత్తికంటె పిడి పెద్దదిగా వుండాలి.
3. వాచీ చిన్నముల్లు 10-11 మధ్య ఉండాలి.
4. గంటకు మధ్య వాయించే కాడ ఉండాలి.
5. సీతాకోకచిలుకకు మీసాలుండాలి.
6. మామిడికొమ్మకు మామిడికాయలే ఉండాలి.
7. కప్పకాళ్లు బాతుకాళ్ళలాగా వుండాలి.
8. తుపాకీకి మీట ఉండాలి.
9. ఏనుగుదంతాలు నోటిలోపలినుంచి ఉండాలి.

# ఫొటో వ్యాఖ్యల పోటీ

## అక్టోబరు ఫొటోల ఫలితాలు



అక్టోబరునెల చందమామలో ప్రచురింపబడె ఫొటోలకుగాను, మాకు వచ్చిన వ్యాఖ్యలలో ఉత్తమంగా వున్న ఈ దిగువ వ్యాఖ్యలకు బహుమతి యివ్వడమైనది.

వ్యాఖ్యలు :

మొదటి ఫొటోకు : 'ఉదక నిమిత్తం'

రెండవ ఫొటోకు : 'ఉదర నిమిత్తం'

పంపినవారు :

సబ్నివీసు శ్రీనివాసరావు - కర్నూలు

బహుమతిపొందిన ఈ వ్యాఖ్యలు, పంపిన వారి పేరుతోసహా అక్టోబరు చందమామ ఫొటోల దిగువన ప్రచురిస్తాము. బహుమతి మొత్తం రూ. 10/- అక్టోబరు సంచిక వెలువడిన వెంటనే పంపబడుతుంది.



## నవంబరు నెలలో

ప్రచురింపబడే ఫొటోల నమూనాలు వివరాలతోసహా ప్రక్కపేజీలో చూడండి

ఒక ముఖ్యసూచన :

మీరు పంపదలచుకున్న వ్యాఖ్యలు కార్డు పైననే వ్రాసిపంపాలి. కొందరు కాగితంపైన వ్రాసి కవరులో పంపుతున్నారు. ఇలాంటివి పరిశీలింపబడవు.

# ఫోటో వ్యాఖ్యల పోటీ

నవంబర్ 1952 :: బహుమానం రూ. 10/





నవంబరు సంచికలో వచ్చే ఫోటోలు రెండూ పైన చూడండి.
వీటికి సరియైన వ్యాఖ్యలు కావాలి. వివరాలు యివి:—

1. వ్యాఖ్య ఫోటోకు సరిపడేటట్లు వుండాలి.
2. ముచ్చటైన ఒక్కమాటలోగానీ, రెండు మూడు మాటలుగల ఒక చిన్ని వాక్యంలోగానీ వ్యాఖ్య ఉండవచ్చు.
3. అన్నిటికన్న ముఖ్యవిషయం: మొదటి ఫోటోకూ, రెండవ ఫోటోకూ కూర్చేవ్యాఖ్యలు రెండూ ఒకదానికొకటి సంబంధించివుండాలి.
4. ఒక్కొక్కరు ఒక్కొక్క సెట్టు వ్యాఖ్యలకంటే ఎక్కువ పంపకూడదు.
5. ఒక కార్డుపైన మీ వ్యాఖ్య, పూర్తిపేరూ, విలాసమూ వ్రాసి, మాకు పంపాలి.
6. సెప్టెంబరు 15-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ఆ తర్వాత చేరినవ్యాఖ్యలు పరిశీలించబడవు.
7. మాకు చేరిన వ్యాఖ్యలలోకెల్లా అత్యుత్తమంగావున్న సెట్టుకు (అనగా రెండువ్యాఖ్యలకు కలిపి) రూ. 10/– బహుమతి ఇవ్వబడుతుంది.

వ్యాఖ్యలు పంపవలసిన అడ్రసు:

ఫోటో వ్యాఖ్యల పోటీ:

## చందమామ పబ్లికేషన్స్

వడపలని పోస్టు :: మదరాసు - 26.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd, Madras 26, and Published by him from Chandamama Publications, Madras 26, Controlling Editor : SRI CHAKRAPANI

Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

చిలుకల జోడు

పంపినవారు
వేములకొండ వెంకట

